enl_Sep_1941_14_7

## వృషనామ సంవత్సర – భాద్రపద - ఆశ్వయుజమాసములు

1941 వ సంll సెప్టెంబరు నెల

| | | |
|---|---|---|
| 1 | సో | ఏ రా1-58 పూషా రా12-30 పవ11-47ల1-17వ పదు12-24 మదు2-53 |
| 2 | మం | ద్వా రా12-28 ఉషా రా11-43 ఉవ8-14ల9-49వ రావ3-40ల5-14వ ఉదు8-16 |
| 3 | బు | త్ర రా11-18 శ్ర రా11-8 రావ11-19ల12-55వ పదు11-34 [రాదు10-52 |
| 4 | గు | చ రా10-40 ధని రా11-20 వర్జ్యములేదు ఉదు9-55 మదు2-51 |
| 5 | శు | ○ పూ రా10-26 శత రా11-48 ఉవ6-40ల8-18వ దినం30-48 చంద్రగ్రహణం ఉదు |
| 6 | శ | బపా రా10-48 పూభా రా12-51 ఉవ6-29ల8-9వ ఉదు7-26వ [8-16 తిరిదు12-22 |
| 7 | ఆ | వి రా11-35 ఉభా రా2-18 పవ11-2ల12-44వ సాదు4-27 |
| 8 | సో | త రా12-52 రేవ తె4-14 మవ3-17ల5-1వ పదు12-21 తిరి దు2-49 |
| 9 | మం | చ రా2-35 అశ్వి పూర్తి రావ2-13ల3-53వ ఉదు8-16 రాదు10-49 |
| 10 | బు | పం తె4-30 అశ్వి ఉ6-37 సావ5-14ల7-0వ పదు11-32 |
| 11 | గు | ష పూర్తి భర ఉ9-9 రావ8-29ల10-15వ దినం 30-34 ఉదు9-53 మదు2-47 |
| 12 | శు | ష ఉ6-35 కృ ప11-46 తెవ5-29ల ఉదు8-15 మదు12-20 |
| 13 | శ | స ఉ8-36 రో మ2-17 ఉ శేవ7-13వ రావ8-27ల10-12వ ఉదు7-27వ |
| 14 | ఆ | అ ప10-22 మృ సా4-35 రావ1-42ల3-26వ సాదు4-22 |
| 15 | సో | న ప11-47 ఆర్ద్ర సా6-29 వర్జ్యములేదు పదు12-18 తిరి దు2-44 [10-45 |
| 16 | మం | ద ప12-47 పున రా7-59 ఉవ7-14ల8-56వ రావ4-9ల ఏకాదశితిథి ఉదు8-15 రాదు |
| 17 | బు | ఏ మ1-17 పుష్య రా8-57 ఉ శేవ5-59వ దినం 30-19 ద్వాదశితిథి పదు11-29 |
| 18 | గు | ద్వా మ1-16 ఆశ్రే రా9.28 పవ10-2ల11-40వ త్రయోదశీతిథి ఉదు9-52 మదు2-43వ |
| 19 | శు | త్ర మ12-43 మఘ రా9-24 ఉవ9-26ల11-8వ తెవ5-19ల ఉదు8-15 మదు12-17 |
| 20 | శ | చ ప11-44 పూఫ రా9-0 ఉ శేవ6-51వ రావ3-59ల5-39వ అమావాస్య ఉదు7-26వ |
| 21 | ఆ | ● అమా ప10-21 ఉఫ రా8-8 రావ4-10ల5-42వ సూర్యగ్రహణం సాదు4-18 |
| 22 | సో | శుపా ఉ8-35 హస్త రా6-59 రావ2-34ల4-4వ పదు12-17 మదు2-41 [10-44 |
| 23 | మం | వి ఉ6-34 తది తె4-20 చిత్త సా5-34 రావ10-51ల12-21వ దినం30-5 ఉదు8-15 రాదు |
| 24 | బు | చ రా1-58 స్వా 4-1 రావ9.16ల10-45వ పదు11-27 |
| 25 | గు | పం రా11-30 విశా మ2-20 సావ6-7ల7-36వ ఉదు9-51 మదు2-39 |
| 26 | శు | ష రా9-5 అనూ మ12-40 సావ5-56ల7-26వ ఉదు8-15 మదు12-15 |
| 27 | శ | స రా6-48 జ్యే ప11-4 రావ6-34ల8-4వ ఉదు7-27వ |
| 28 | ఆ | అ సా4-41 మూ ఉ9-38 ఉవ8-8ల9-38వ రావ6-48ల8-19వ సాదు4-13ల [2-36 |
| 29 | సో | న రా2-52 పూషా ఉ8.26 సావ4-19ల5-51వ దినం29-50 తిథిద్వయం పదు12-13 తిరిదు |
| 30 | మం | ద మ1-21 ఉషా ఉ7-33 పవ11-28ల1-2వ ఏకాదశితిథి ఉదు8-14 రాదు10-39 |

## ముఖ్య పండుగలు

4. అనంతవ్రతము. 14. వైష్ణవ శ్రీకృష్ణజయంతి. 20. మహాలయ అమావాస్య.

22. శారద నవరాత్రప్రారంభము. 27 సరస్వతీపూజ ప్రారంభము. 30. విజయదశమి.

# విషయసూచిక


1. విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు ... 379
2. రవీంద్రుని తుది గీతం ... 383
3. స్వాతంత్ర్యము - రవీంద్రుని ప్రార్థన ... 384
4. రవీంద్ర కవీంద్రుడు—శ్రీ దేశిరాజు భారతీదేవి ... 385
5. రవీంద్రు నస్తమయము—శ్రీమతి విద్వాన్ కంచనపల్లి కనకాంబ ... 386
6. ఖానాదేవి—శ్రీ శింగంపల్లి రామమూర్తి ... 387
7. స్త్రీ—శ్రీ క్రొత్తపల్లి రంగారావు ... 389
8. ఇది భగవంతుని యుద్దేశమేనా?—శ్రీ గోపరాజు సీతాదేవి ... 390
9. అసూయ—శ్రీమతి వింజమూరి అనసూయ ... 392
10. ఆత్మ సమర్పణం—శ్రీ వే. రాధాకృష్ణమూర్తి ... 393
11. పరుసవేది—శ్రీ పూర్ణానంద ... 399
12. మమత—శ్రీ బొందలపాటి శివరామకృష్ణ ... 400
13. మాసూ కన్య వీరజీవితగాధ—శ్రీ పరకాల పట్టాభిరామారావు ... 403
14. పతివ్రత!—శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి ... 405
15. రాధ—శ్రీ పోలిశెట్టి వేంకట నాగేశ్వరరావు ... 406
16. పోలిక—శ్రీమతి డి. శకుంతలాదేవి ... 409
17. దృష్టి—శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ ... 410
18. పృథ్వీప్రశస్తి—శ్రీ రజనీకాంతరావు ... 412
19. సౌందర్యపోషణ—శ్రీ అలంపురం రాజు, బి. ఏ. ... 413
20. "శిశువు"—శ్రీ కర్లపాలెం కృష్ణరావు ... 416
21. స్వార్థమా? సంస్కారమా?—శ్రీ వల్లూరి గోపాల్ కృష్ణ ... 417
22. జగదుద్యానము—శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి ... 421
23. స్త్రీ సాముద్రిక శాస్త్రము—శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి ... 422
24. స్వర్గీయ శ్రీ చేరాల భారతీదేవి—శ్రీమతి చేరాల మాధవీ కుమారి 423
25. నక్షత్ర ఫలితాలు—కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి ... 424
26. బాలభాగ్యం - రాజపుత్రస్థానం—'పిన్ని' ... 425
27. అశ్రుతర్పణము—శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు ... 426
28. స్త్రీల వేసంగిపాఠశాల, బాపట్ల—శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ ... 427
29. సంపాదకీయములు ... 429


త్రివర్ణచిత్రము: చెలిమి కలిమి



చెలిమి కలిమి




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు

రవిబాబు మరణించినాడు. రవీంద్రు డస్తమించెను. విశ్వకవి యిక మనకు లేడు. విశ్వవిఖ్యాత భారతజాతీయ కవిసార్వభౌముని భౌతిక శరీరము పంచభూతములలో కలసిపోయినది. అయితే ఆయన యశశ్శరీరము శాశ్వతముగ నుండగలదు. ఆయన ఆత్మకు మృతిలేదు. ఠాకూరు అమృతుడు.

అంతేకాక ఆయనపేరట, శాంతినికేతనము, విశ్వభారతి మహావిద్యాలయము, శ్రీనికేతన కళాభవనము ఆచంద్రతారార్కముగ వెలసియుండగలందులకు విశ్వప్రయత్నములు జరుగగలవు.

కవీంద్రుని అగణనీయమగు రచనలద్వారా ఆయన సజీవాత్మ విశ్వవ్యాప్తమై శాంతి నందగలదు.

కాలమే యున్నంతవరకు, కావ్యపఠనమే యున్నంతవరకు, మానవజాతి యంతటికి, గురుదేవుని సందేశము అందుచుండగలదు.

రవీంద్రనాథటాగోరు వంగరాష్ట్రమునకు, భారతదేశమునకు, హిందూ సంప్రదాయమునకు, ప్రాచ్యఖండమునకు మాత్రమే చెందిన వ్యక్తికాడు. ఆ మహాత్మ విశ్వ

ప్రపంచమునకు, జగత్కుటుంబమునకు చెందిన లోకబాంధవుడు. సర్వమానవజాతికి ప్రతినిధి యనదగిన మహావ్యక్తి. ఆయన విశ్వేశ్వరునివద్దనుండి విశ్వమంతటికి సందేశమును దెచ్చియుండిన శాంతిదూత. అమృత వార్తలను తెచ్చిన రాయబారి. ప్రాచీనులతరఫున ఆధునికులకు, ప్రాగ్దేశవాసుల పక్షమున పశ్చిమఖండస్థులకు జ్ఞాన ప్రబోధమును చేయ నవతరించిన మహామనీషి. భారతీయులకు ఆంగ్లేయులకు మధ్య ఉండిన దూరమును తొలగించు సౌహార్ద సేతుబంధనము చేసిన నిర్మాణశీలి. భారతీయ విజ్ఞానవైభవమును యావత్ప్రపంచమునకు వెల్లడిచేసిన ఉత్తమ దేశభక్తుడు. భారతభాస్కరుడని ఇతడు పిలువబడెను.

హృదయ తంత్రులను మీటి విశ్వవిజయగీతములను పాడిన మేటిగాయకుడు.

మానవజాతి యేకత్వమును, సర్వమానవ సౌభ్రాత్రమును, పరమేశ్వరుని ఏకత్వమును అనంతత్వమును, దర్శించుటకు తానుచేసిన యావజ్జీవ మహిత సాధనద్వారా తన బుద్ధికి తోచినట్టి, మనస్సునకు నచ్చినట్టి, తనకు హృదయంగమమైనట్టి, అనుభవమునకు వచ్చినట్టి అంశములనెల్ల సుందర సురుచిర రూపములలో మాటలతోను పాటలలోను బొమ్మలుగను అత్యుత్తమ శిల్పచాతుర్యముతోను, కళాసమన్వితముగను చిత్రించిన అపూర్వ చిత్రకారుడు, సిద్ధహస్తుడు.

మానవాభ్యుదయమునకు, ఉన్నతికి, పరమగతికి, శాంతి సత్యములే మార్గములను జీవంత విశ్వాసముగల ఆశావాది.

విశాల భావములు, ఉన్నతాదర్శములు, ఉత్తమ ఆశయములు, పవిత్రమైన స్వదేశాభిమానము గల జాతీయవాది. మాతృభాషయందు, ఆర్య సభ్యతా విజ్ఞాన సంప్రదాయములందు నిరుపమానమును నిష్కళంకమునగు శ్రద్ధాభక్తులు గలవాడు.

వినయమును ఆత్మగౌరవమును అతి చక్కగా సమ్మేళనముచేసి వ్యక్తిత్వమును మూర్తివంతమును అద్భుతముగా అభివృద్ధిచేసుకొని సర్వమాన్యుడైన సార్థకజీవి.

ఠాకూరు కవి, ఋషి, యోగి, ద్రష్ట. విశ్వజనీనమయిన ప్రబోధమును చేసిన రచయిత, వక్త, గాయకుడు. ఆయన బ్రహ్మజ్ఞాని, వేదాంతి, తత్వవేత్త.

ఆయన ''గీతాంజలి''కి నోబెల్ బహుమాన మీయబడినది. ప్రపంచమున నింతకంటె గొప్ప బహుమతిలేదు. నోబెల్ బహుమానమును బడసిన ప్రథమ భారతీయుడు రవీంద్రుడే. ఇప్పటికిని సారస్వతమున ఇంకే భారతీయునికి ఈ బహుమానము రాలేదు. కవిసార్వభౌముడని (Poet Laureate of Asia) అనే బిరుదుతో యీ విశ్వకవి ప్రపంచ విఖ్యాతి నందెను.

వాల్మీకి, వేదవ్యాస, కాళిదాసాది మహాకవుల సంతతి వారసత్వము నందుకొని ధన్య జీవితమును గడపినవా డితడని భారతీయ కవి ఋషి సంప్రదాయమును గూర్చి యెరిగినవారందరు రవీంద్రునిగూర్చి ప్రస్తుతించిరి.

ఈయన సారస్వత (సాహిత్య) సేవలకు డాక్టరేటును పొందిన ఘనుడు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ పక్షమున, ఇండియాఫెడరల్‌కోర్టు ప్రధానన్యాయమూర్తి సర్ మారిస్‌గ్వయర్ స్వయముగా శాంతినికేతనమునకు వచ్చి కవీంద్రునికి డాక్టరు బిరుదము నందజేసి, యిట్టి యవకాశము తనకే అపూర్వ గౌరవమని సంతోషించెను.

ప్రభుత్వమువారు రవీంద్రునికి సర్ బిరుదము నిచ్చియుండిరి గాని, పంజాబు వధల యనంతరము ప్రభుత్వమువారి నిరంకుశపాలనావిధానము యెడల తన తీవ్రతమ నిరసనభావమును వెల్లడించు లేఖను అప్పటి గవర్నరు జనరలుకు వ్రాసి దానితోపాటు ఠాగూరుగా రా బిరుద గౌరవచిహ్నములను తిరుగగొట్టి, తానింక యీ బిరుదును ధరింప నిరాకరించిన ఘట్టము భారతీయ జాతీయజీవన చరిత్రలో ఎన్నడును మరుపరానిది. యావన్మంది భారతీయులలో నేయొక్క సంఘమువారికిని అభ్యంతరము లేకుండునట్లు ఏకగ్రీవామోదమును బడసి, దేశము నాలుగుమూలల ప్రతిధ్వనించునట్లు గానము చేయ బడిన, ఏకైక భారత జాతీయ గీతమును రచించగలిగినది కవిశేఖరుడు భక్తుడు నగు రవీంద్రనాథుడే. "జన గణ మన అధినాయక జయహే భారతభాగ్యవిధాతా!" అను జయగానమును వినని, పాడజాలని బాలబాలికలుండరనవచ్చును.

ఇంతేకాక ఆయనదే ఇంకొక ప్రసిద్ధగీత మున్నది. "ఎమోన్ దేష్‌టి కొథాయ్ ఖొజే పాబే నకో తుమి, సొకోల్ దేశేర్ రాణి షేజే అమార్ జన్మో భూమి" అనే ఒడలు పులకరించు సహర్ష సంగీతమును రచించినదితడే.

"పాదోప్రాంతే రాఖో సేవాకే
శాంతిసదన సాధనధన దేవదేవహే!"

అనే రవీంద్రుని సువిఖ్యాత భక్తిగీతమును ముక్తకంఠముతో పాడ నిచ్చగింపని ప్రార్థనా శీలు రుండరు.

బాలబాలికలకు తగిన పద్యములేమి, యువతీ యువకులకు యిష్టమగు గేయము లేమి, కథలేమి, అందరూ పలుమారు చదివి యానందించు నవలలేమి, నాటకములేమి, ధీరగంభీరమును యోచనాభరితము నగు వ్యాసావళియేమి, లేఖావళియేమి, ఆత్మజీవన సంబంధమగు కథనములేమి, మర్మకవిత్వమేమి, ఉపన్యాస అభిభాషణములేమి, విమర్శ

వ్యాసములేమి, రాజకీయ ఉద్బోధనములేమి, అసంఖ్యాకముగ సర్వతోముఖముగ విశేషముగ, వివిధవిధముల రచనలను ఠాకూరు చేసియుండెను. అయితే ప్రతి ఒక్క ప్రవచనమును రచనయు తొలుదొల్త తన మాతృభాషయగు బెంగాలిలోనే జరిగితీరినది. తర్వాతనే తానుగాని, తనదగ్గరివారుగాని ఆంగ్లములోనికి అనువాదముచేయుట. అంతటి ప్రగాఢమయిన మాతృభాషాభిమానము ఎవ్వరికున్నది? ఠాకూరు రచనలు ప్రపంచములోని అనేకదేశముల వివిధభాషలలోనికి తర్జుమాచేయబడి అసంఖ్యాకమగు ప్రతులు అమ్ముడుపోయినవి. భారతదేశమునకు ప్రపంచమంతటిలోను సువిఖ్యాతి తెచ్చినది, ముఖ్యముగ ఆంగ్లేయుల గౌరవమును చూరగొనినది, రవీంద్రుని రచనావిశేషమే. గాంధీ మహాత్మునికంటె ముందుగా యావత్ప్రపంచమున మారుమ్రోగిన ఏకైక భారతీయ నామధేయము రవీంద్రనాథ ఠాకూరుదే.

ప్రగాఢము వినిర్మలము నగు స్వాతంత్ర్య పిపాసకు, సంకుచితముకాని విశేషతర నిష్కలంక దేశభక్తికి, సునిశ్చలము - సంపూర్ణ విశ్వాసయుతము నగు దైవభక్తికి, చెప్పుకోదగిన మహావ్యక్తి రవీంద్రుడు. విశ్వమానవ సోదరభావమందు, మానవజాతి ఏకత్వమునందు, మానవ ప్రకృతియొక్క సహజ సౌజన్యతావికాస అవకాశభాగ్యమందు, విధాతృ పరమోద్దేశమునందు, మానవుని మహత్వమందు, జీవన పావిత్ర్యమునందు, అచంచల అటల అమిత విశ్వాసము గలిగియుండినవాడు తపస్వి రవీంద్రుడు.

ఈయన స్వీయజీవితమున కష్టనష్టములను వియోగదుఃఖములను అనుభవించినవాడే. నడివయస్సుననే భార్యను గోల్పోయినాడు. పుట్టిన ఐదుగురు బిడ్డలలోను ముగ్గురు అకాలమరణముల పాలైరి. తల్లి ఈయన చిన్నతనముననే పోయినది. ఋణములు తీర్చుటకు బంగారమును వెండినికూడా అమ్ముకొనవలసిన చెడ్డరోజులను గడపినాడు. తాను స్థాపించిన ఆదర్శప్రాయమగు విశ్వభారతి అంతర్జాతీయ విశ్వవిద్యాలయమును నిర్వహించి పోషించుటకు తాను ఆస్తినంతయు, తన ఆదాయమంతటిని, తన రచనలనన్నిటిని ధారపోయుటో, విక్రయముచేసి ధనము సంపాదించుటో, చేయుట చాలక ప్రపంచమంతటా బిచ్చమెత్తినాడు. తన తర్వాత తన సంస్థలు తొలుతటి మహితాశయములతోను, వెనుకటి ప్రభతోను కొనసాగునో లేదో యను విచారమును ఉండినవాడే. అయినను త్యాగబుద్ధితోను, సమర్పణభావముతోను నిశ్చింతగ మరణమునకు సంసిద్ధమై మృత్యువును ఆహ్వానించినాడు. మరణశయ్యపైనుండి, కూడ చరమగీతమును రచియించినాడు.

ఎనభై యేండ్లు సార్థక ధన్యజీవనమును, లోకకళ్యాణముకొఱకైన అమూల్య జీవితమును గడపి, కడచిన శ్రావణపూర్ణిమనాడు అస్తమించిన కవిచంద్రునిగూర్చి లోక

మంతయు మాసినది. ఒక్కమారు జగతియంతా అంధకారబంధురమైనది. అత్యంత ఉన్నత అధికారపదవుల నుండు ప్రభువులు మొదలుకొని అతి సామాన్యజనమువరకు, అన్ని దేశములవారు, అన్ని జాతులవారు, స్త్రీలు, పురుషులు - అందరును విశ్వకవికొఱకు అశ్రుతర్పణము చేసిరి. అతని శ్రాద్ధదినము అత్యంత భక్తి శ్రద్ధలతో జరుపబడినది.

ప్రత్యేకముగ స్త్రీలును కొన్నికొన్ని మహానగరములలో - మదరాసులో కూడ - అన్ని జాతుల- వివిధదేశముల ప్రతినిధులు సహా, రవీంద్రుని తలపోయుచు సానుభూతి తీర్మానములుచేసి, వారి ఆత్మశాంతికొఱకు ప్రార్థనలు గావించిరి.

స్త్రీ - పురుష సమానత్వముకొఱకు, నారీగౌరవముకొఱకు, స్త్రీ విద్యా వ్యాప్తికొఱకు, స్త్రీలకు సంబంధించిన సర్వవిధ అభివృద్ధి కార్యకలాపములందును, లలిత కళల - శాస్త్రవిద్యల పునరుజ్జీవనముకొఱకును, సంగీత సాహిత్య సరసవిద్యలను, నృత్యగాన నటనారంగములందు ఈ శతాబ్దమున స్త్రీలకు ప్రోత్సాహమిచ్చిన కళోద్ధారకుడు రవీంద్రుడే యను సంగతి స్త్రీలు ఎవ్వరును ఎన్నడును మరువరానిది. ఈ విషయమున భారత నవనారి ఠాగూరుకు ఎంతయు ఋణపడి కృతజ్ఞురాలై యున్నది. రాజకీయమున, ఈమధ్యనే ఆంగ్లవనిత రాత్‌బోన్‌కన్య లేఖపై, రవీంద్రుడు భారతీయుల పక్షమున ఇచ్చియుండిన చిచ్చులపిడుగువంటి ప్రత్యుత్తరము నెవ్వరును మరువరు.

నిఖిల ప్రపంచమునను భారతదేశమునకు శాశ్వతకీర్తి నార్జించిన గురుదేవుని అనంతాత్మకు శాంతిప్రార్థన చేసెదము.

---

# రవీంద్రుని తుది గీతం

## మృత్యువు

[దివంగతులైన శ్రీ రవీంద్రనాథ ఠాకూరుగారు అవసానదశయందు చెప్పిన గీతం, బెంగాలీనుండి ఆంగ్లంలోనికి - ఆంగ్లంనుండి తెలుగులోనికి అనువాదం.]

దుఃఖమయమైన చీకటి తోచె నాకు
హృదయవాటిక గప్పుచు మది గలంచె
మరల మరలను గుబులుగ నిరులు క్రమ్మె.

శోకతిమిరాస్త్రజాలమ్ము భీకరమ్ము,
బాధ విహ్వలభ్రూకుటి బాణచయము,
భయద ఘోరాంధకార విభ్రాంతి జనిత
వికట చేష్టాస్త్రరాజి పెన్వైరపు గొలిపె.

వెలి ముసుంగిది భీకర భేషజమ్ము
నమ్మితిని నేను కోర్కులం బమ్మ కాగ
పుట్టినప్పుడె మనభీతి భూత మనగ
వెంటఁ దిరుగుచు వెతగూర్చి వెక్కిరించు.

వాంఛ లీడేరు, నడుగంటు; ప్రాణికోటి
మోద ఖేదాల దాగుడుమూతలాడు-
జీవయాత్రయె తెరమీది చిత్రమట్లు
భయపరంపర గాథయై పరలుచుండు.

చెదరియున్నట్టి యీ చిమ్మచీకటి తెర
పైన మృత్యువు చూపెను పనితనంబు.

(ఆంధ్రపత్రికనుండి.)

# స్వాతంత్ర్యము - రవీంద్రుని ప్రార్థన



ఎక్కడ మనస్సు భయాన్ని ఎరుగదో, ఎక్కడ తలయెత్తుకు తిరగ వచ్చునో—

ఎక్కడ జ్ఞానం శృంఖలాబద్ధమై లేదో—

ఎక్కడ గృహచ్ఛిద్రాలతో సంఘం ఖండఖండాలై పోయి, సంకుచితమై లేదో—

ఎక్కడ సత్యగర్భంలోనుంచి వాక్కు ప్రభవిస్తుందో—

ఎక్కడ విరామ మెరుగని కృషి లోపరాహిత్యం దిశకు బాహువుల్ని చాస్తూ వుంటుందో—

ఎక్కడ యుక్తాయుక్త వివేకజ్ఞాన శుభ్రస్రవంతి మృత సాంప్రదాయాల ఎడారిలో పడి నిరర్థకమై పోకుండా వుంటుందో—

ఎక్కడ మనస్సు నిత్యం విశాలతరమాతున్న భావాలద్వారా, కార్యాల ద్వారా పురోభివృద్ధిని పొందుతూ వుంటుందో—

ఆ స్వాతంత్ర్యాశ్రయంలోకి, గాఢ సుషుప్తినుంచి మేల్కొంచిన నా మాతృ దేశాన్ని, దేవా! చేరనిమ్ము!

("గీతాంజలి" నుండి—ఆంధ్రజ్యోతి అనువాదం.)

# రవీంద్ర కవీంద్రుడు

కం॥ జగదేక కవీశుడవై అగణిత విఖ్యాతి భారతాంబకు నార్జిం
పగజాలిన మేటి రవీంద్రగురూ, కాలనియతి దప్పదె నీకున్.

సీ॥ ఘనమహర్షి యశంబుగాంచిన దేవేంద్రనాథఠాకూరు నందనుడవగుచు
వంగదేశమున కాభరణంబుగాబుట్టి వంగభాషకు చాల వన్నెబెట్టి
కావ్యముల్ రచియించి కళలను బోషించి చిత్రలేఖనమందు చెన్నుజూపి
అభినయకళలోన నతిశక్తి మెనయించి భక్తిగవిత్వంబు వ్రాయగలిగి
ఖండ ఖండాంతరంబుల గణనగాంచి
మాతృదేశపు సాహితి భూతలమున
వెలయజేసిన మహితాత్మ విపులకీర్తి
మణిని గోల్పోయె భారతమాత నేడు.

ఉ॥ శాంతినికేతనంబొకటె చాలదె చెప్పగ నీదు శక్తియున్
వింతగు విశ్వభారతియె వేయివిధంబులజాటు నీ మహా
నంతసమత్వభావ మహాహా! కవితారచనాళి జూడ దా
నంతనె భక్తివైభవము నందరకున్ దెలియంగ నయ్యెడున్.

గీ॥ వంగమే గాదు నిన్నెంచి పొంగిపోవు
నఖిల భారతరాష్ట్రంబు లనవరతము
నార్య విజ్ఞానకవితల నరసి తాము
గర్వమును బొందుదురుగాదె కవులు చాల.

గీ॥ ఆత్మ శాంతినికేతనమందులేని
పరమశాంతి సదా నీవుబడసి, తనిసి
లలితకళలను నేర్పు ముల్లాసమునను
సత్యకైలాస వైకుంఠ జనులకింక
నెలమి వారలు మురియ రవీంద్రనాథ.

సీ॥ స్వర్గలోకద్వార పటలి తటాలున దెరువంగబడియె సుధీవరేణ్య
దేవర్షివరులు సంభావింప నెదురుగా వచ్చుచున్నారదే పరమతేజ
దశ దిశాంతరముల ధన్యవాదములు ప్రతి ధ్వనించెను నదే దివ్యపురుష
పుష్పాంజలులతోడ పొంగుచు భక్తులు మోగు లదే నిల్చి రుజ్వలాత్మ
స్వాగతశ్లోక సంగీత సరసమధుర
వాక్సుధాధార బ్రస్థానభరముదీర
నమరకాంతలు నీకొఱ కరుగుదెంచి
రదిగో విశ్వకవి నీకు మర్యాదసేయ. —దేశిరాజు భారతీదేవి.

# ⟶ రవీంద్రు నస్తమయము ⟵

గీ. అల రవీంద్రుండు గనలేనియది కవీంద్రుఁ
డెఱుగఁజాలెడు నంద్రు దేవేంద్ర సుతుడు
భానురేంద్రుండు సత్కళాభాసురుండు
ఘనరవీంద్రకవీంద్రుండు గననిదేది?

గీ. ఎలుగు మిన్నంట బలుకు సురేంద్రనాథు
నెలమి బాడంగ వినిరి రవీంద్రనాథు
వంగదేశీయు లవ్వారి భాగ్యమేమొ
విశ్వభారత విఖ్యాతి వెలసినారు

గీ. భరతభారతి మానసాబ్జ మకరంద
పాన పరవశులై యుండ భారతీయు
లెల్లకడలందు జల్లె, రవీంద్రగంధ
వాహుడద్దానగల సౌరభం బదెల్ల

గీ. రవి రవినిజేరె ముక్తుఁడై రాహుబాధ
లేనివా డీ రవీంద్రుండు వీని కస్త
మయములేదెందు బ్రాక్పశ్చిమముల సమత
♦ వేయికరముల సతతము వెలయుచుండు

గీ. కోకిలంబొకో యితడు వాల్మీకి యగునొ
యెలుగు మధురంబు నాకృతి ఋషిని బోలు
సరస సంగీత సాహిత్య సామరస్య
మితని యందుంట వాణి రవీంద్రుడేమొ

చ. పలుకకయున్న నామొగమె పర్వము జూడగమాటలాడినన్
పలుకువెలంది పల్కినటు భావము రంజిలు పాటపాడినన్
తలిరులు పుట్టు బ్రోడులకు తాపసయోగ్యము నీ నికేతనం
బలవియె నిన్ను నెన్నఁగ మహాకవిచంద్ర! రవీంద్ర యేరికిన్?

—కవితిలక, కవితా విశారద, విద్వాన్, కంచనపల్లి కనకాంబ.

---

♦ వేయిమంది కరములలో నీతని పుస్తకములు వెలయుచున్నవి.

# ఖానాదేవి





శ్రీ
శింగంపల్లి
రామమూర్తి



(ఏకాంకిక)

స్థలము: ఒక గది.

కాలము: సంధ్య.

[ప్రవేశము: ఖానాదేవీ, కత్తి చేతబూని ఆమె భర్త మిహిరుడూ]

మిహిరుడు:- ప్రియా! ప్రియా! ఈపని నాచేతకాదు. నిరపరాధినివి. నీ నాలుక యీ కఱకుకత్తితో ఏలాగు ఖండించేది? అబ్బా! నా మేధస్సులో సహస్రవృశ్చికములు ప్రాకులాడుతున్నవి. నా గుండెలు మండిపోతున్నవి. ఈ జాలిలేని అనుచితమైన పితృాజ్ఞ నేను నెరవేర్చలేను. దేవీ! విజ్ఞానమయీ!

ఖానా:- ప్రభూ! బ్రహ్మవ్రాత నెవరు తప్పించగలరు? జ్యోతిషశాస్త్రం నాకప్పుడే యిల్లా జరుగగలదని తెలిపింది. మీరు కేవలం కాలంచేతిలోని ఉపకరణమాత్రులే.

మిహి:- జ్యోతిషం! బ్రహ్మవ్రాత! నీ కత్యంతప్రియమైన ఆ పాడుజ్యోతిషమే నీపాలిటి మృత్యువయింది. నీవు ఆకసములోని నక్షత్రసంఖ్య గణించి చెప్పకుంటే ఆ విక్రమాదిత్యుడు మన కులగౌరవహాని కల్గించే నీ రాజసభాప్రవేశం నిర్బంధంగా కోరేవాడా! అంతా బ్రహ్మవ్రాతేయైతే యీ జ్యోతిష మెందుకు? దేవీ! యిదంతా మూఢజల్పన. కృత్రిమ వ్యాపారం.

ఖానా:- ప్రభూ! శాస్త్రనింద వద్దు. అనార్యజాతివద్ద మనమిద్దఱం ఎన్ని కష్టాలకోర్చి ఆ అనర్ఘవిద్య సాధించాము! ఎంత పట్టుదలతో నిర్జనారణ్యాలలో మిన్కుమిన్కులాడే తారకాగణాలతో విరాజిల్లే ఆకాశపు రహస్యం భేదించటానికి ఎన్నిరాత్రులు శ్రమించామో, భరణీ, కృత్తిక, మృగశీర్షాది నక్షత్రాలను వాటి గతులనూ నిర్ణయించను ఎన్నివత్సరాలు జాగరణంచేశామో, కేతు శన్యాదిగ్రహాల గతులూ వాటికీ మానవ శుభాశుభాలకూ వున్న సంబంధమూ కనిపెట్టటానికి ఎంతకాలం మన మేధస్సులు పనిచేశాయో మఱచిపోయారా? ప్రభూ! మీరానాడు జ్యోతిషాన్ని గర్హిస్తే యింతటి పండితులయ్యేవారా?

మిహి:- పాండిత్యం! ఏమిటి నా పాండిత్యం! దేవీ! నీ జ్ఞానంలో నా తెల్వి ఏపాటిది? జ్ఞప్తిలేదా, మన మిద్దఱం సెలవుతీసుకొని వచ్చేనాడు మన గురువర్యులు ఈనే ఆవునుచూపి పుట్టబోయే వత్సం ఏవర్ణం గలదిగా వుండునని ప్రశ్నించడం, నా ఉత్తరం యథార్థదూరం కావడం! దేవీ! నాకానాడే నిరాశ కల్గింది. ఏల యీ వ్యర్థపరిశ్రమ అనే నిస్పృహ జనించింది. ఛీ! పాడు జ్యోతిషం. నిరర్థకప్రయాస!

ఖానా:- అవును ప్రభూ! మీరా నిస్పృహతోనే అమూల్య జ్యోతిషగ్రంథాలు గురుదత్తాలు నదీప్రవాహం పాలుజేస్తిరిగదా! జ్యోతిషవిద్యకెంతో కొఱత కలిగిస్తిరే! నాకృషి అయినా తుదముట్టకుండా

భగవానుడు నా జీవితనాటకంలో అంతిమాంకం ప్రదర్శింపిస్తున్నాడు. ప్రభూ! ఈ నిర్భాగ్యురాలిని మఱువబోకండి. మీ పాదసేవా, జ్యోతిశ్శాస్త్రశోధన యీ రెండే నాకు ఏడుగడగా ఉండినవి. శని కక్ష్యాపరిమాణమూ, రాహుగ్రహదశా పరిణామపద్ధతీ ఇత్యాదులనిగురించి నేను సాగిస్తున్న గణనాలు మీరు పరిపూర్తిచేయరూ? అదే నా ఒక్క కోఱికానూ. మీ రామాట సెలవిస్తే నిశ్చింతగా మరణోన్ముఖురాలనౌతాను. భర్తచేతి చావు ఎందఱికి లభిస్తుంది!

మిహి:-హా! ప్రియా! యీపనికి నా చేతులాడవు. నా గుండె వజ్రంకాదు. హతవిధీ! ఎట్టి సంకటఘట్టం తెచ్చిపెట్టితివి!

[ వరాహుడు ప్రవేశిస్తాడు ]

ఖానా:-మామగారూ! ఇవే నా తుదిపంద నాలు.

వరా:-అమ్మా! ఖానా! నిష్ఠురవిధి విలసనం నన్నీ క్రూరకృత్యానికి ప్రేరించింది. క్షమించు. ఈ మిహిరుడిని ధర్మపథంలో ప్రవేశపెట్టు. బయటనుండి మీ మాటలువిని నేను వచ్చాను.

మిహి:-తండ్రీ! ధర్మపథమా? స్వార్థపరత్వంకాదా! నీ కులగౌరవ రక్షణకోసం ఒక కుసుమకోమలి అసువుల బలియా? ఇంత దురంతమా? శ్రీరాముడైనా జానకీ ప్రవాసమే కాని వధకు లక్ష్మణుని నియోజించలేదే!

ఖానా:-ప్రభూ! జమదగ్ని పరశురాముణ్ణి రేణుకావధకు నియోగించలేదా!

మిహి:-దేవీ! రేణుకలాగు పతితవా నీవు? ఎందుకీ పోలికలు? దేశాంతరం పోదాముర ప్రియా! ఈ నిష్ఠుర పితృాజ్ఞ నేను పాలించను. ఈ కటికిగుండె కిరాతునితో మనకేల?

వరా:-నాయనా! నా గుండె ఎన్ని వ్రయ్యలౌతున్నదో నీవు తెలిసికోలేవు. కర్తవ్యంపట్ల వెనుదీయడం భీరులక్షణం. మీరు దేశాంతరమేగినా ఖానా జ్యోతిషవిజ్ఞాన సౌరభం ఆమె కేనాటికైనా అంతం కల్గించకపోదు. అదీగాక విక్రమాదిత్య నృపాల చార దృక్కులు బహుదూరగాములు. ఎన్ని పౌర్వా పర్యాలు విచారించి ఎన్ని ఏకాంతక్షణాలు యోచించి యీ కఠోరనిశ్చయానికి వచ్చానో నీకే మెఱుక! ఖానా రాజసభాప్రవేశం తప్పించుకోవటానికి వేఱే మార్గము నాకు తోచలేదు.

ఖానా:-మామయ్యగారూ! మీ వాక్కులు వేదతుల్యాలు. స్త్రీనైన నాకు ఇంతటి జ్ఞానప్రకర్ష హానిదాయకమే! నా తాహత్తును మించింది నా విద్యాగోష్ఠి! కాని——కాని——మామయ్యగారూ! తప్పెవరిది? నా హృదయంలోనుంచి పైకి ఉబికుబికి పొంగి పొరలివచ్చే జ్ఞానతృష్ణాప్రవాహాన్ని అరికట్టలేక పోయాను! నేను అబలను. వివేచనా విహీనురాలిని. శలభంలాగు జ్ఞానదీపికలో రెక్కలు కాల్చు కుంటున్నాను.

మిహి:-దేవీ! దేవీ! నీవు సాక్షాత్తు సరస్వతివి. గార్గి మున్నగు పురాణ స్త్రీలలాగు ఏల రాజసభకు పోరాదు?

వరా:-నాయనా! కులమర్యాద అవిలంఘనీయము. ఇది గార్గినాటికాలము కాదు. అమ్మా! ఖానా! నిశ్చలవై భగవద్ధ్యానం కావించుకో! (మొగం పక్కకు తిప్పుకుని బయటికి వెళ్ళిపోతాడు.)

మిహి :- నాకింక గత్యంతరం లేదా? దేవీ! నేను నీ భర్తను కాను. నీపాలిటి కాలయముడను. ఈ కటికిపనిచేసి కళంకితుడనై ఏల నేను జీవించడం? నీవు ప్రపంచానికి చేసిన అమూల్యసేవకు ప్రతిఫలం జిహ్వాఖండనమా? అబ్బా!

ఖానా :- ప్రభూ! ఏల యీ వృథా కాలయాపన? రక్తసంధ్యలోనుంచి మృత్యుదేవి నన్నాహ్వానిస్తున్నది. స్వగమనరహస్యభేదనం కావించిన నన్ను వినీలాకాశంలోనుంచి తారకాచయం క్రుద్ధ దృక్కులతో వీక్షిస్తున్నవి. నా మరణ ఘటికలు ఆసన్నమైనవి. (మోకరిల్లి చేతులు జోడించి) యాజ్ఞవల్క్యసతి భారతనారీ శిరోరత్నము మైత్రేయీదేవి కావించిన దివ్యప్రార్థన నాకు చేయూత అగుగాక!

"అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మామృతంగమయ - ఆవీరావీర్మ ఏధి రుద్రయత్తే
దక్షిణముఖం తేన మాం పాహినిత్యం."

ప్రభూ! విలంబమెందుకు? కన్నీరు తుడుచుకోండి. నాకు సెలవియ్యండి. మీవిధి నెరవేర్చండి.

(మిహిరుడి వణికే చేతిలోని కత్తి ఖానాదేవి చాచిన బంగారు నాల్కను ఖండించగా రుధిర ధారాప్రవాహం సంధ్యారుణిమాకాంతులకు మఱింత ఎఱ్ఱనైపోతుంది. మిహిరమూర్ఛ - ఆయన లేవక పూర్వమే ఖానాదేవి మానవలీల సమాప్తమైపోతుంది.)

(తెర)

భారతజ్యోతిషాకాశాన ప్రదీప్త దివ్యతారా!
భారతనారీకుల తిలకాయమానా! ఖానా!
తేర్పవే సమ్మూర్ఛితాస్మన్మానసంబుల్
దేవీ! భవ్య విజ్ఞానమూర్తీ! నమస్సుల్!

---

## స్త్రీ

తెగువ యంటే (త్యాగమంటే)
మగువయేనోయ్!
మగువ యెఱుగని
తెగువ యెదోయీ? (త్యాగమే)

* * *

ఓరిమంటే
ఉవిదయేనోయ్!
ఉవిద నేర్వని
ఓరిమేదోయీ?

అడకువంటే
పడతియేనోయ్!
పడతి జూపని
అడకువేదోయీ?

* * *

వలపు అంటే
వనితయేనోయ్!
వనిత దెలియని
వలపు లేదోయీ!

—క్రొత్తపల్లి రంగారావు.

# ఇది భగవంతుని యుద్దేశమేనా?

శ్రీ గోపరాజు సీతాదేవి

అది ఒకమాలగూడెం. అక్కడయిండ్లు యిండ్లని చెప్పడానికి సందేహముగానేవుంది. కాని ఏమి చెయ్యను? యిండ్లని చెప్పకతప్పదు. ఆహా! ఏమీ విశ్వమానవ ప్రపంచములో, ఒకజాతిలో, ఒకరు మహోన్నత మేరుశిఖరాల్లోనూ, ఒకరు అధఃపాతాళ పూరిగుడిశల్లోనూ! ఒకరు ఆకలిమంటలతోనూ, ఒకరు అజీర్ణబాధతోనూనా! ఇది భగవంతుని వుద్దేశమేనా?.

ఆ గూడేనికి ఒకపాతిక యిండ్లు వుంటాయి. ఇండ్లచుట్టూ అంతా మురికిరొంపి. వాటినిచేరి వారికి సాయమేమోనన్నట్టు దోమలు వానిఅఖండ సంతానముతోటి కాపురముంటాయి. అక్కడ ఒకఇంట్లో వెంకి తన నలుగురిబిడ్డలతోటీ, తనభర్తతోటీ కాపురముంటుంది. దానిభర్త రాముడు ఒక రైతుదగ్గర నవుఖరీ. రాముడు యింటికొచ్చేసరికి, గంజికాచి తిరగపోస్తూ యుంటుంది. పిల్లలు చుట్టూ మూగుంటారు గంజికోసం.

రా:- ఈరోజునా ఆ గంజేనా?

వెం:- నువ్వు ప్రొద్దున మొదలు, ఘామురాత్రివరకూ పనిచేయుచున్నావు కనుక ఈగంజేనా వుంది. యిందాక వాళ్ల సుబ్బి 'చంటిపిల్లాడికి మూడురోజులనుంచి కూడులేదు కాస్త గంజివుంటెపోస్తూ' అనొచ్చింది ఏమిచెప్పను? అందులోదే కొంచెము పోసేను. మనయింట్లోనూ, నూక లయిపోయినాయి.

రా:- ఓపు, కామందునడిగి ధాన్యం యిస్తారేమొ, పట్టుకొస్తానులే.

వెం:- ఏమో, ఏమితెస్తావో? యింటిలో గుప్పెడునూకలేనా లేవు. నేను కూలికెళుతున్నానా, పనిచేయించు కున్నవారు వెంటనే డబ్బులియ్యరు. ఏలా బతుకుతామనుకుంటారో!

రా:- వారికేమి వారు మనచేత పని చేయించుకోడమేకాని, మనము తింటున్నామొ, పిల్లలూ మనమూ పస్తుంటున్నామో వారు ఆలోచించనే ఆలోచించరు. అసలు వారికి తెలియనే తెలియదు. వారు ప్రభువులు. మనము బానిసలము. నేను పొలమువెళుతున్నా, అక్కడికే ముంతతీసుకురా.

చక్కని ప్రదేశం. ఒకవంక వరివెన్నులు బంగారు కుచ్చులోయన తలలువంచి చూపరులకు అమితానందము కలుగచేయుచున్నవి. ఒకవంక చేలుకోసి కుప్పలు వేయుచున్నారు. ఒకవంక కోతలు కోయుచున్నారు. పైరులుఫలించి, భారతదేశం 'రత్నగర్భ' యను నుడువులు సార్థకం చేయుచున్నది. కానీ తమరు కష్టించి ఫలపర్చిన వస్తుసంపద తన ముద్దుబిడ్డలయిన కర్షకసంతతి పిసరైననూ తినుటలేదని భారతమాత విలపించుచున్నదేమొ యన్నట్లు ఏటేటా వర్షపాతము, సస్యములు కొన్నిటిని పాడుచేయుచునే యున్నది. ఆదిమవాసులకు అపూర్వ కళయిన వ్యవసాయము నేడుశ్రమజీవులకు కొంచెము ఆకలిబాధ నివర్తిస్తూన్నది.

రాముడు, ఇంకా కూలిజనులు, కుప్పలువేసిన ధాన్యమునూర్చి బళ్ళమీద కామందు ఇంటికి తీసుకపోతారు. వారిదొక పెద్దమేడ. ఆ ఇంటియజమాని నరసయ్య ఒకకుర్చీలో కూర్చొనుంటారు ఆయాసపడుతూ.

నరసయ్య:- ఒరే రామిగా ధాన్యమంతా యింటికిచేరిందా?

రా:.లేదండి బాబుగారు యింకా రెండుసబుర్లు పడతాయి.

న:-వెలుగుండగానే తోలెయ్యండి.

రా:-చిత్తం బాబు, యీవేళ కూటికిబ్బందిగా వుందండి. యింటికాడ పిల్లలు గంజినీళ్లు తాగుతున్నారు. బాబయ్యగారూ, రెండు కుంచాలు ధాన్యం దయచేయించండి.

న:-అప్పుడే అయిపోయినాయా వారము రోజులక్రిందటేగా రెండుకుంచాలు పట్టుకెళ్లేవు?

రా:-ఎన్నిరోజు లొస్తాయండి? నలుగురు పిల్లలూ, మేము తినాలి.

న:-నీపెళ్ళాము కూలికెళ్లదా? ఆ డబ్బులేం చేస్తారు?

రా:-బాబయ్యా రోజల్లా పాటుపడి పనిచేస్తే బేడ డబ్బులుకూలి. అదేన సమయానికివ్వరు.

నర:-ఈవాళ శుక్రవారం, రేపు అమావాస్య, ఎల్లుండి తీసుకెడుదుగానిలే! పో! ధాన్యం తోలుకురండి, మాటలతోటి వేళమించింది.

రా:-అయ్యగోరూ? పిల్లలు మాడిపోతారండి బాబు!

న:-మీఖర్మం, మేమేమిచెయ్యం? యీవాళియ్యకూడదు, పో!

♦ ♦ ♦ ♦

ఎంతో సేపట్నుంచి కూకున్నాను. ఏజాముకీ రాలేదు. కామందుని ధాన్యం యడిగావేమిటి? యిదిగో! గంజి. శోషవచ్చేలావుంది!

రా:-నాకేమి లే, పిల్లలేలా బ్రతుకుతారు? రెండు రోజులదాక ధాన్యం యియ్యమన్నారు.

వెం:-అంత విచారించి మనమేమి చెయ్యగలం! యివతల పసిపిల్లలు మాడి ఆకలిమంటలకు ఆహుతి అవుచున్ననూ వారికి మనసు కరుగదు. పోనీ, ముష్టికెళ్లి తెద్దామంటే, మనను అంటరానివారని దగ్గరకు రానివ్వరు. మనము ముష్టి ఎత్తుకోడానికేనా నోచుకోలేదు.

రా:-వెంకీ? ఏది గంజి ఏది? ఇదియే మనకు సమస్త ఫలహారములు, ఇదియే మనము నిత్యమూ సేవనచేయు మధుర రసము.

♦ ♦ ♦ ♦

ఆరోజు జరిగిపోయింది. తిరిగి రోజు వచ్చింది. కూలిజనులంతా ఎవరిపనుల్లోనికి వారు వెళ్లినారు. ఆరోజు యథాప్రకారం జరిగిపోయింది. లోకబాంధవుడు వీరి కష్టాలు చూడలేక కామోసు తల్లిగర్భంలో దాక్కున్నాడు. సంజచీకటులు అలుముకొన్నాయి. ఆ అభాగ్యజీవుల ఆశాహృదయాల్లా చెట్లమీద మిణుగురు పురుగులు; ఘప్పుమని వెంటనే మణుచుకుపోతున్నాయి.

వెంకి యింట్లో చంటిపిల్ల నోరుయెండేటట్టు ఏడ్చి, కొయ్యబారిపోయింది. వున్నపిల్లలు అమ్మకోసం రొుదురు చూస్తూయున్నారు. యీలా ఎన్నిజీవములో! 'ఓప్రభూ! ఇదేటి న్యాయం?'

# అసూయ

ఇరుగు పొరుగులనుండు నేయింతియైన
నగలు నాణెములొంది తన కవి లేక
యున్న వల వల విలపించు నువిద యొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

కలికి యొకతెకు మగనితోఁ గాఁపురంబు
మిగుల ననుకూలముగనుండ వగచి తనకు
నట్టిభాగ్యంబు లేదంచు నార్చు నొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

తోడిబాలికల్ చదువునందుఁ గడు హెచ్చఁ
దాను వారిఁ గలియలేక లేని పోని
మాటలాడి నిందించు వధూటి యొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

చెలియ కంఠస్వనము సుధాలలితమనుచుఁ
దజ్ఞూలాడిన నేదియో తప్పుఁ బట్టి
యపయశం బామెకుం దేర నరయు నొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

ఇంతియాకృతి యాకర్షణీయమంచు
నెల్లరాడు పొగడికల్ సహింపలేక
స్వల్పలోపాలఁ బెంపంగ సాఁగు నొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

లలితకళలఁ బ్రజ్ఞ యొకర్తె కలవడంగఁ
దనసుతల కట్టితెల్వి లేదనుచు వగచి
పాపమామె న్నిరుత్సాహ పఱచు నొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

ఓడకున్నమాట వెలికి నాడు స్త్రీని
మెచ్చుకొక పైపెచ్చు కీర్ష్యచ్చులాగు
గర్విని యటంచుఁ బ్రకటింపఁ గడఁగు నొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

పూత పాతివ్రత్య మహిమచేత నొకతె
యవని సర్వసౌఖ్యశ్రీల ననుభవింప
వానిఁ జెఱుపంగఁ బూను నభాగ్యయొకతె
హేయతర గుణమున్నె యసూయకన్న?

ఉన్న సుగుణంబు గ్రహియించి యుపకృతి నొన
రింపఁ బూనక యింకనుం బెంపు వలయు
నం చతృప్తిమైఁ గొలఁగించు నబల యొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

తాను రంగనాథునిగ నెదం దలంచి
ప్రీతిఁజూచు నొక్క నటకాగ్రేసరుండు
మఱొక నటిని మెచ్చఁగను నమర్ష నొకతె;
హేయతరగుణమున్నె యసూయకన్న?

సుగుణ సంపదగాని, భాసురకళా వి
లాస మొండుగాని, సురూపలక్షణమ్ము
గాని, లేని సామాన్యయే యైనఁ దనకు
నారులెల్ల లొంగి మెలంగఁ గోరునొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

తనకలిమి జగత్సంపద, తనదులేమి
యఖిలలోక దారిద్ర్యం బటంచు నెంచి
యొరులఁ జిన్నఁజూపునఁ జూచు గరిత యొకతె
హేయతర గుణమున్నె యసూయకన్న?

తానుఁ దనప్రియ సుతలు మాత్రంబె నిపుణ
లార్యసభల గౌరవపాత్ర లగుదు రంచు
నాత్మ సంస్తవ పరనిందలందు నొకతె;
హేయతర గుణమున్నె యసూయకన్న?

—వింజమూరి అనసూయ.

# ఆత్మసమర్పణం

శ్రీ వే. రాధాకృష్ణమూర్తి

సహానుభూతి, ప్రేమ—ఈ రెండూ కలిసినప్పుడు వేదనా సముద్రంలో తుపాను రేగుతుంది. ఆ తుపానులో ధైర్యము, సహనము అనే శిథిలమైన నావ ఎంత ఆపినా ఆగదు. దానిని ఒడ్డుకు చేర్చడం కష్టం. ఆ కన్నీటి మహాసముద్రంలో మునిగి లీనమై పోతుంది. అయితే సముద్రం? అది దానిదారిని రెట్టింపు వేగంతో, ఆవేశంతో, విఘ్నాలను, అడ్డంకులను దాటుకుంటూ ప్రళయ గర్జనాలతో ప్రవహించుకుంటూ వెళ్లిపోతుంది.

చీకటిపడింది. అయినా ఇంకా ఆమె అలాగే ఏదో ఆలోచనలో మగ్నమయిపోయి నిలబడి వున్నది. మెల్ల మెల్లగా పట్నంలో దీపాలుగూడా వెలిగాయి. అయినా ఆమె ఆలోచనకు అంతము అనేది కనబడలేదు.

ఇంతలో ఎవరో పిలిచారు

'ఒదినా'

రజని ఉలిక్కిపడి వెనకకుతిరిగి చూచింది. ఆమె చిన్న ఆడబడుచు తార నిలబడి నవ్వుతూవుంది.

'ఒదినా! ఎవరినిగురించి ఇంతగా ఆలోచిస్తూన్నావు?'

రజనిని బలవంతంగా కూర్చోబెడుతూ అన్నది. జవాబుగా రజని కేవలం కమలాల్లాంటి కండ్లనుండి ముత్యాల్లాంటి రెండు కన్నీటిచుక్కల్ని రాల్చింది.

'ఒదినా! ఏడుస్తున్నావా? ఏమిజరిగింది?'

'ఏమీ జరగలేదు తారా.'

'కాదు, కాదు, నీ యీ అబద్ధాల్ని నమ్మేటందుకు నేనంత అమాయకురాలను కాను. వెళ్లి అన్నయ్యతో...............'

'వద్దు, తారా, వద్దు, నీవు వెళ్లితే నేనింక నీతో మాట్లాడను' అని రజని వెళుతూన్న తారను ఆపుజేసింది.

'ఏం ఒదినా! అన్నయ్యతో చెపితే ఏమయినా గోలఅవుతుందా?'—తార స్వరంలో తెలుసుకుందామనే కుతూహలముంది.

'నా ఏడ్పును లెక్కజేసేటందుకు నేను నీలాంటి అందగత్తెనూ కాదు—'కన్నీటితోనే నవ్వుతూ అన్నది రజని.

'వెళ్లు ఒదినా, నీవు చాలా చెడ్డదానివి' అంటూ తార సిగ్గుతో అక్కడనుండి పరుగిడి వెళ్లిపోయింది.

ఒదిన అన్నమాట తారహృదయంలో తుపానును లేవదీసింది. ఇన్నిరోజులయిన తర్వాత ఒదిన ఇంత దుఃఖంగా ఎందుకుంటూవున్నదో, తనఅన్న ఒదినకు యింత దూర దూరంగా ఎందుకుంటూన్నాడో

తెలుసుకున్నది. తార హృదయం అన్నను ధిక్కరించింది. అన్నయ్య ఎంత హృదయహీనుడు...కాని ఒదిన ఎంత ఉదారహృదయ!......ఎంత సహనశీల!...ఎంత దుఃఖిని!

♦ ♦ ♦ ♦

'అబ్బాయీ, అరుణ్! నీవింత దుఃఖంగా ఎందుకు వుంటూన్నావు? కోడలి సంగతేనా, నాయనా! వాళ్లదేముంది. వాళ్లంతా కాలిచెప్పుల్లాంటి వారు. ఒకటి పాతబడితే విడిచి రెండో క్రొత్తదాన్ని ధరిస్తాం. నేడే నీకు రెండోపెండ్లి చేస్తాను. ఆ అమ్మాయిని చూచావుగదూ...వాళ్లఇంట్లో పెండ్లికికూడా వచ్చింది. ఢిల్లీలోవున్న డాక్టరుగారి అమ్మాయి ఆ అమ్మాయి. తల్లి ఎవరయినా పిల్లవాడుంటే తెలియజెప్పమనిగూడా చెప్పింది'

'కాదు, అమ్మా, రజని వున్నది గదా! ఆమె వుండగానే ఇంకెవరిని...?...'

'దానితో నీ కెందుకు...?...నీవువెళ్లి ఆ అమ్మాయిని చూచిరా. అంతే. నేను తక్కినదంతా చూచుకుంటాను. నేడే వుత్తరంగూడా వ్రాస్తాను.'

'కాని అమ్మా...పాపం......'

'కాని, గీని, పాపం, గీపం,...ఏమీలేదు.'

'అయితే సరే లే అమ్మా, నాల్గయిదు రోజులయిన తర్వాత వెళ్తాను.'

దర్వాజా వెనకాల నిలబడి రజని అంతా విన్నది. ఒక్కసారి కంపించిపోయింది. తెగిపోయిన తీగలా వెళ్లి మంచంమీద పడిపోయింది.

'ఒదినా!' తార గదిలోకి ప్రవేశిస్తూ అన్నది.

రజనిముఖాన్ని బలవంతంగా పైకిఎత్తుతూ తార మరల పిల్చింది. 'ఒదినా!'

'.............................'

'అరే, ఏడుస్తూన్నావా? ఏమయింది ఒదినా, చెప్పవూ...?'

రజని ఏమీ మాట్లాడక తారఒడిలో ముఖం దాచుకొని ఎక్కువగా ఏడ్వటం ఆరంభించింది.

తార, రజని ఇద్దరూ ఏడ్వసాగారు.

రజని ఏడుపుకు అర్థం కనపడుతున్నది. ప్రేమమయమయిన తార ఒడిలో తలదాచుకొని క్షణం—ఒక్కక్షణంకాలం—ఏడిస్తే ఆమె హృదయం తేలికవుతుంది.

కాని తార ఏడుపుకు ఉద్దేశ్యం? ఏమో అర్థంకావడంలేదు. బహుశా ఒదినగారి కన్నీటిధారను చూస్తే ఆమె కళ్లనుండి గూడా కన్నీళ్లు ఉప్పొంగి ఉండవచ్చు.

♦ ♦ ♦ ♦

'వినలేదా రజనీ? నా గుడ్డల్ని సర్దమని ఎంతసేపయింది చెప్పి. కొంచెం బైటకు వెళ్లాలి'

'ఎక్కడికి వెళుతున్నారు?' భయపడుతూ భయపడుతూ రజని అడిగింది.

'చెప్పేశానుగదూ, బైటకొంచెం పనివున్నది. తొందరగా వెళ్లాలి, అని'

'నేనుగూడ వస్తాను'

'వద్దు, వద్దు... నేను ఇంకో... వేరేపనిమీద వెళుతూన్నాను. నిన్నుగూడా తీసుకొని ఎక్కడెక్కడికి తిరిగేది!' అంటూ అరుణ్ తొందరగా బైటకు వెళ్లిపోయాడు. రజని మళ్లీ ఏమయినా అంటుందేమోనని అతని భయం.

రజనిగూడా బట్టలు సర్దసాగింది.

'ఒదినా' తార పిల్చింది.

'ఆఁ'

'ఇవన్నీ ఎందుకు సర్దుతున్నావు? అన్నయ్య ఎక్కడికయినా వెళ్తాడా?'

'ఆఁ' అదేవిధంగా పనిలో మగ్నమయి రజని సమాధానమిచ్చింది.

'ఒదినా! అన్నయ్య ఎక్కడికి వెళ్తూన్నాడు? నీవు అలా మాట్లాడుతున్నావేం? ఆరోజున ఏడ్చావు. ఇవాళ అన్నయ్య ఎక్కడికో వెళుతున్నాడు. కాని నీవు మాత్రం పరాయిమనిషిలా నాతో మాట్లాడుతున్నావు. ఒదినా! నాదగ్గరకూడా దాస్తావా? చెప్పవూ ఒదినా? నా దగ్గరకూడా దాస్తావేం! చెప్పొదినా?'

'.....................'

'ఒదినా! నీకుగూడా తెలియదా!' తార రజనిని కౌగలించుకుంటూ అడిగింది.

'నాకు తెలుసు తారా, విని ఏమిచేస్తావు? నీకు గూడా.........'

'అవునవును నా కెందుకు? నా ఒదిన బ్రతికివున్నాసరే చచ్చినాసరే, ఏడ్చేందుకు ఆమెకు నేనే మవుతాను? ఇదేకదూ ఒదినా, నేటిదాకా ఈ సంగతే నాకుతెలియదు. నీవు చెప్పివేశావు. నమస్కారాలు' తార తనకన్నీటి వేగాన్ని ఆపుకుంటూ అక్కడినుండి వెళ్లిపోసాగింది.

'ఓ తారా కొంచెం ఆగుతేనా—!'

తార వినిగూడా విననట్టు నటించింది. ద్వారంవద్ద కొంచెం ఆగింది. కాని వెనుకకు తిరుగలేదు.

'తారా, ఆగు నేను చెప్తాను. నీవే నేనంటే ఏవగించుకుంటే ఎవరి సహాయంతో జీవిస్తాను తారా! ప్రేమమయమయిన నీ ఒడిలోనే గదూ నాకు కొంచెం శాంతి దొరుకుతూవున్నది'—అంటూ రజని తారచేయి పట్టుకున్నది.

రజని తార కన్నీటిని చీర చెరుగుతో తుడుస్తూ అన్నది. 'తారా కూర్చో, అంతా చెబుతాను.'

జరిగిన సంగతిఅంతా విని తార కోపంతో మండిపోయింది. 'ఏమి! ఇంతవరకు జరిగినదా? నేనీ అత్యాచారాన్ని జరుగనివ్వను. ఏమీ అన్నగారి కర్తవ్యం! ధర్మం యిదేనా? నీ రక్షణ యిలాగే చేస్తూన్నారా! ఛీ ఛీ, ఇలాంటి మనుష్యుల్ని ..............'

'తారా, అలా అనకు' రజని తారనోటికి తనచేయి అడ్డుపెడుతూ అన్నది.—'ఏమయినా ఎంతచేసినా నీకు అన్నగారు. మంచివారయినా, చెడ్డవారయినా మనయిద్దరికి పూజ్యులు. కాని, తారా పతిసుఖంలోనే స్త్రీ సుఖంగూడా.............'

'చాల్లే యింక వూరుకో ఒదినా. స్త్రీ, పురుషుడు కొనుక్కొన్నదాసికాదు. ఇద్దరికీ సమానమయిన అధికారాలే ఉన్నాయి. పురుషుడు స్త్రీని తృణీకరిస్తే స్త్రీగూడా పురుషుని..........'

'ఊరుకో తారా. అలా అనగూడదు. నిజమే తారా, పురుషులు మనకు ఎన్నో అపచారాలు చేస్తూన్నారు. అపరాధి మనలను నీచదృష్టితో చూస్తే మన కర్తవ్యం ఏమిటి? అతనిని ఉదారమయిన దృష్టితో చూడడమే, అదే అతనికి తగినశిక్ష.' రజని వ్యాకులపడుతూ అన్నది.

'అయితే ఏమి! స్త్రీలు ఎల్లకాలం పురుషులు తన్నేతన్నుల్ని, చేసే దురహంకారపు పనులను సహిస్తూ 'అబ్బా' అనిగూడా అనకుండా వుండమనియా?'

'కష్టాల్ని సహిస్తూ 'అబ్బా' అని అనకుండా వుండవలసినదని ఎందుకంటాను తారా. ఈ అత్యాచారాలకు వ్యతిరేకంగా మనం ఆందోళన చెయ్యాలి, చేస్తూనేయున్నాము. కాని అత్యాచారాలద్వారా అత్యాచారాల్ని ఆపుజేయగూడదు. వాటిని ఆపేందుకు మనం స్వార్థత్యాగం చేయాలి. ఆత్మ బలిదానం చేయాలి.'

'ఒదినా'

కాని రజని ఆగలేదు.

'మనం ఈ అత్యాచారాల్ని ప్రేమ, త్యాగం, సహనశీలత, ధైర్యం, బుద్ధి వీటి ఆధారంతో అరికట్టగలము. వారిని తిరిగి తిట్టి అత్యాచారాలు చేసుకుంటూ అరికట్టలేము.'

'ఒదినా, సిద్ధాంతాలు సిద్ధాంతాల్లాగానే వుంటాయి.'

'కాదు తారా. అవే అబద్ధాలయితే మనం వాటిని త్యజించాలి.'

'అయితే, ఇంకేం, నిన్ను నీవే చెరుచుకున్నావు. నేనేంచేసేది? అనుభవించు.'

'బాగా ఆవేశంచెందావు తారా. కొంచెంసేపు నిద్రించు. ఇంతలో నేనీపనిని పూర్తిచేస్తాను.'

తార మాట్లాడకుండా వెళ్లిపోయింది.

ఇంక రజని, వెళుతూన్న తారను చూస్తూ, మూర్తిలా నిలబడిపోయింది. ఈ అమాయికమయిన బాలిక మనస్సులో ఎంత సహానుభూతి, ప్రేమ, దయ వున్నాయి!

ఆమె ప్రియుడు ఆమెను తృణీకరించినాడు. ఆ అమావాస్యనాటి ఘోర అంధకారంలో— తడుముకుంటూవున్న ఆమెకు యీ ప్రేమమయి తార అనే క్షీణజ్యోతి కనబడింది. ఆ జ్యోతితో తనత్రోవను ప్రకాశవంతంగా చేసుకొనేందుకు ప్రయత్నించి ముందుకు నడుస్తూ ఈశ్వరుడుచూపిన ఈ దయకు ఈశ్వరునికి ధన్యవాదాలర్పించింది.

♦ ♦ ♦ ♦

అరుణ్ ఉషను వివాహమాడాడు. పెండ్లివారు ఆనాడు తిరిగివచ్చెడు రోజు. రజని దుఃఖ భారంతో కృశించిపోతున్నది. కాని కండ్లవెంట కన్నీరుకారిస్తే భర్తగారి భావిసౌఖ్యానికి అపశకునప్రాయమేమోనని ఆవేదన. దుఃఖాన్నంతా దిగమ్రింగుకుంది. తనపనుల్ని తాను చూచుకుంటూ ఉండిపోయింది.

కాని తార తన మనస్సును ఆపుకోలేకపోయింది. తలనొప్పి అనే వంకతో భోజనంకూడా చేయక నిదురించింది.

మెల్లమెల్లగా పెండ్లి వూరేగింపు వచ్చింది. రజని అమితోత్సాహంతో క్రొత్త పెళ్లికూతురికి స్వాగతం యిచ్చేందుకు వెళ్లింది—ఈ దృశ్యంచూచి అరుణ్‌గూడా చకితుడయిపోయాడు.

సాయంకాలం రజని తన బహుమూల్యమయిన ఆభరణాలతో ఉషను అలంకరిస్తూ అన్నది—చెల్లీ, నీవు వారిని సుఖపెట్టు (గద్గదస్వరంతో) అభాగ్యురాలనగు నేను ఆయన సేవ బాగాచేయలేకపోయాను. కాని నీవుమాత్రం నిజంగా ఉషవే. చెల్లీ, వారి జీవనంలో సుఖమయమయిన ప్రభాతం తీసుకొనిరా.

'జీజీ' ఉష సిగ్గుతో తలవంచుకున్నది.

'ఛీ, ఇందులో సిగ్గుపడవలసిన సంగతి ఏముంది? పిచ్చిదానా' రజని నవ్వుతూ ఎర్రని మృదువయిన ఉష బుగ్గలమీద మెలిబెట్టింది.

'రజనీ' బైటనుండి అత్తగారి పిలుపు వినబడింది. 'ఓ రజనీ,—ఎక్కడపని అక్కడే వున్నది. దాన్నంతా వదిలి ఎక్కడికి వెళ్లావు?'

రజని ముఖం తెలతెలబోయింది. తొందరగా తనచేయి వదిలించుకొని గదినుండి బైటకు వెళ్ళిపోయింది.

ఉష చూస్తూనే వుండిపోయింది. తన సవతినిగురించి తాను ఎన్ని అభూతకల్పనలు కల్పించుకొన్నది! కాని జీజీమాత్రం సాక్షాత్తుదేవి. ఇలాంటిదేవిని పొందిగూడా వారు—

ఇంక ఆలోచించలేకపోయింది.

   

'అబ్బో, ఒదినా, ఇంత అలంకరించుకొని ఎక్కడికి వెళుతున్నావు? ఎంతో అందంగా వున్నావు. ఒదినా ఈ సమయంలో అన్నయ్య నిన్ను చూచాడా అంటే ఉషనువదలి నీమీదనే......అరే, వినిపించు కోకుండానె వెళుతూన్నావా? కొంచెం ఆగు ఒదినా...జవాబయిన చెప్పు—ఎక్కడికి వెళుతున్నావు? కొంచెం ఆగు, నేనుగూడా వస్తూన్నాను.'

'వద్దు, వద్దు, నీవు వద్దు, నేను ఒంటరిగా వెళ్తాను. యివాళ నా గర్భాధానపు రాత్రికదూ—' చూడు—అదుగో, నాకోసం ఎదురుచూస్తూన్నారు. ఆలస్యమయిందా అంటే కోపగించుకుంటారు.

'ఒదినా, పిచ్చిదానవు అవకు—అక్కడ ఎవరూలేరు—ఆగు ఒదినా.'

'కాదు, కాదు. నేను వెళ్తాను.'

'ఒదినా,'

'నన్ను ఆపకు, వెళ్ళనియ్యి.'

ఎదుట నది. భయంకరరూపందాల్చి నోరుతెరుచుకొని రజనిని ఆహ్వానిస్తున్నట్లున్నది. తరంగాలు గట్టుకు కొట్టుకొని భయంకరాట్టహాసం చేస్తున్నాయి.—తార—కాదు—మానవుని ఈ మోహంచూచి ఆకాశంమీద మేఘాలు గర్జించి గర్జించి తమకోపాన్ని వెలిబుచ్చుతున్నాయి. దాహంవలన గిలగిల కొట్టుకొంటూన్న జీవాలకొరకు నీటిని కురిపించే ప్రయత్నంలోనూ, భూమిమీద పనికిరాకుండా ఉన్న వస్తువుల్ని ఎగరకొట్టుకొని తీసుకుపోయే ప్రయత్నంలోనూ—తుపాను ప్రబలమయిన వేగంతో మగ్నమయివున్నది.

ఘోర రాత్రి. నాల్గువైపుల ఘోరాంధకారం వ్యాపించివున్నది. భయంకరమైన తుపాను—కాని పడుతూ లేస్తూ వెళ్లుతూనే వున్నది రజని—

తార మేల్కాంచింది. ఆమె శరీరమంతా ముచ్చెమటలు పోశాయి. ఆమె శరీరం వణుకుతూ వున్నది. అబ్బా ఎంత భయంకరమైన స్వప్నం.

తార హృదయం ఏదో ఆశంకవలన కంపించింది.

ఆమె మెల్లగా ఒదినదగ్గరకు చేరింది.

గదిలో లైటు వెలుగుతూనేవుంది. ఏమి ఒదిన యింకా మేల్కొనియే వున్నదా? అరే తలుపులు కూడా వేసుకోనలేదే, ఆమె మెల్లగా తలుపుతెరచి లోన ప్రవేశించింది. లోన రజని మంచంమీదపడి అంతిమశ్వాస తీసుకొంటూ వుంది.

ఒదినా! ఒదినా! అంటూ తార రజనిదగ్గరకు చేరింది. ఒదినా! ఇదేమి......దగ్గరే ఖాళీ అయిన విషపు సీసా పడివున్నది.

'ఒదినా!' తార ఆపుకోనలేక ఏడ్చింది. తార స్వరంవిని రజని మెల్లగా కండ్లువిప్పింది. 'వచ్చావా! తారా - ఇంక నీ ఒడిలో - నీ ప్రేమమయమయిన ఒడిలో - సుఖంగా చనిపోతాను. నీదగ్గరే సెలవు తీసుకోవలసివున్నది.'

'ఒదినా, ఇదేమి, ఇలాచేశావు?'

'ఏది...ఉచితమో...అదే...నేను వారి...మార్గంలో...అడ్డు...అయ్యాను...సెలవు...తారా ...క్ష...మిం...చు...తా...రా' రజని ఆ సుఖమయమయిన ఒడిలోనే అంతిమశ్వాస వదిలింది.

తార ఒదినమీదబడి ఏడ్వసాగింది.

♦ ♦ ♦ ♦

అటు తూర్పున ఉషఃకాలమయింది. నాల్గువైపుల ప్రకాశం వ్యాపింపసాగింది. రజని ఈ ప్రపంచాన్నుండి సెలవుతీసుకొన్నది.

అరుణ్ కి మాత్రం ఆ సెలవు జ్ఞప్తియేలేదు.

ఉషాదేవి పూజలోనే మగ్నమయి ఉన్నాడు.

(హిందీనుండి)

[వర్ణితవిషయమున కాధారము 'భక్తమాల' యను ప్రాచీన గ్రంథము.]

రాజులు జోలెఁబూని మధురాభువి గోపవధూధవార్పితాం
భోజమనస్కులై, విరహభూషణభూషితులై, విదేహులై
రోజులఁగడ్పు కాలమది రూపసనాతనుల న్సహోదరుల్
భ్రాజితకీర్తు లుగ్రసుతపంబుల గోఁడుదు రివ్విధంబునన్.

పచ్చని పట్టుబట్ట కలవాఁడు, జపాసుమలాలిమాభ్రమే
అచ్చముగా యనందగు పదాంబుజ యుగ్మమువాఁడు చూడ, హా
స్వోచ్ఛలితాననుండు, పరమోల్లసనంబున కాటపట్టునౌ
సచ్చరితుండు మాహృదయ సారసపీఠిక సంస్ఫురించుతన్.

అరయ 'తరుతలవాసంబు, కరతలముల భిక్ష వారొనర్తురుగాని వృక్షతలము
నిత్యనూతనమగుచుండు 'నేను, నాది'యనెడు భావమునకుఁ దావు బరగుచుండ.

అదియు నీశ్వరవిరహార్తినడరు తద్వ్యథాతపనకీలలం శుష్కతనువుదాల్చు;
విప్రయోగము లన్నింట విశ్వభర్త విరహ మిల దుస్సహనమంద్రు విజ్ఞజనులు.

దీనత రూపుగొన్న యటు దీపిలు భూసురుడొక్క డేగుదెం
చానతజానువై వడి సనాతను పాదములంటి పల్కు 'మీ
కై నడయాడి కాళ్లుపడె కంటిని కన్నులవిందుగాగ నా
కాన యొసంగె మొన్న కలయందు భవుండల మిమ్ము వేఁడగాన్.

మిగుల నిప్పచ్చరంబునఁ బొగులువాఁడ, తిరిప మెత్తించుగీతను దిద్దుమయ్య!
పూర్వజనిఁ జేసుకొన్నట్టి పుణ్యమేమొ' అని పలుకు పేద కా సనాతనుఁడు నుడువు

'త్యాగమొనరించి వచ్చితి దానవిధిని చిల్లిగవ్వైనలేదు నాచెంత నేమి
చేతు? పరుసవేదియొకఁడు చేతబడెను మొన్న, దాచియుంచితి కొనుమన్న దాని!'

విప్రుడద్దాని యమునలో వినరిపారవైచి, ఏమణిని బడసి వదలగలిగి
నాడవో యామణిని, దాని నాకొసంగు మనుచుఁ బ్రార్థించె ముకుళితహస్తుడగుచు.

అంత, ఆశాభ్రమణ వేదనాంతరంగ రంజితారణుండైన తరణి మునింగె
అస్తనీరధి; మఱునాడు యమున కలఁగె మణినిగాలించు ఫిల్లిసమ్రాట్టుకతన.

# ★ మమత

●

— శ్రీ —

బొందలపాటి శివరామకృష్ణ

●

> మాతృహృదయ మనుటతోడనే ప్రేమ సుధారస భాండమని స్ఫురించక మానదు. తన సంతానమునకై నిస్స్వార్థముగా సాహసించి ఆత్మబలికైనను వెనుదీయని వ్యక్తి తల్లిగాక మఱొండేదీ?

భర్త చనిపోయి ఎంతోకాలం కాలేదు. పాపడు ఇంకా రెణ్ణెల్లకి పుడతాడనగా పోయాడు. వాడికిప్పుడు అయిదోమాసం. తొలిచూలిబిడ్డ సూరికూడా బాబుమీద బెంగతో తిండీ, తిప్పలూ తినక చిక్కి, క్షీణించి ఎండురోగంతో పోలేక పోయాడు. ఇక బ్రతకవలసింది తనూ తన చంటిబిడ్డా! తిండికి నూకలు లేవు. ప్రసవించినప్పుడు పొరుగావిడవద్ద తీసుకొన్న బదులే ఇంకా తీరలేదు. ఇక బ్రతుకుతెరువెట్లా? తను ముష్టిఎత్తితే నీచమైన మనిషిగా చూడబడుతుంది. బదులుకోరితే ఎవ్వరూ ఇవ్వరూ. దొంగిలిస్తే నేరస్తురాలవుతుంది. వ్యభిచరిస్తే వేశ్యయని కులంలోంచి వెలివేస్తారు. వేరుగతిలేక తొలిబిడ్డ పోయిన దిగులుకూడా మనసులో పెట్టుకోకుండా, పచ్చిశరీరంతోటే కట్టెలమ్ముకుని కాలం గడుపుతూవుంది కమల.

మిల్లు పేరెత్తగానే ఆమెప్రాణాలు బిగుసుకపోతాయి. క్రిందటి సమ్మెలో ఆమెభర్త పోయిన దగ్గరనుండీ సమ్మెమాట వినగానే ఆమెగుండె దడదడలాడుతుంది. సమ్మెఅంటే తమ ప్రాణాలతో మిల్లుముందు బలికావటమనీ, రక్తపాతమనీ, రుద్రభూమనీ ఆమె అభిప్రాయం. ఈ రెండుమూడు రోజులనుండీ జీతాల పెంపుకోసం మిల్లులో సమ్మె జరుగుతూంటే కట్టెల కెళ్లకుండా ప్రాణాలు బిగబట్టుకొని భయంతో, పస్తులతో, తన పసిబిడ్డతో కొంపలో మగ్గుతూవుంది.

జోలపాడుతూ సముదాయించి పసిపాపణ్ణి పండబెట్టింది; నిద్రబోతున్నాడు. తన చంటిబిడ్డను ఒంటిగా ఒదలి కట్టెలకెళ్లాలి. ఎవరుతోడు? లేచిఏడిస్తే? వసారాలోని ఆవుదూడ సముదాయించదా! చూరుల్లో జొర్రాడుతున్న ఎలుకలు జోలపాడవా! అంతకుతప్ప తనబిడ్డకు ఇంకెవరుదిక్కు? నిద్రపోతున్న బిడ్డను ముద్దిడుకొంది. ఎత్తి హృదయానికి హత్తుకొంది. ఇక పుల్లలకెళ్లాలి, వెళ్లాలి. మూడురోజులనుండీ పస్తులతో కడుపు కాల్చుకొంటోంది. బిడ్డకు పాలు చాలటంలేదు. బిడ్డమీద మమత హృదయాన్ని చీల్చుతోంది. కడుపులోనిమంట కడుపును కాలుస్తుంది. బిడ్డను ఒంటిగా ఒదిలిపోవాలి. నేను తిరిగివచ్చేదాకా చూస్తుండమని ఎవరికి చెప్పిపోతుంది? రోజూ ఇంటిదరి ఇల్లాలుతో చెప్పిపోయేది. ఇవ్వాళ ఆమెకూడా ఇంటివద్దలేదు. రోజూ పూజిస్తున్న పోలేరమ్మ ఉందిగా! ఆమెకే మనసులో మ్రొక్కుకొంది. తన దుర్భాగ్యంమీద రెండు కన్నీటిచుక్కలు విడచింది. మళ్లావంగి నిద్రబోతున్న బిడ్డను ముద్దిడుకొంది. బిడ్డమీద మమత పయట పట్టుకులాగుతున్నా ఆగక కడుపుమంటలకు లొంగి, కంటి నీటితో కట్టుతాడు పుచ్చుకొని, ఇంటితడిక వేసి బయలుదేరింది అడవికి.

మధ్యాహ్నపు ఎండ చిటచిటలాడుతోంది. చిల్లులతో చినిగి జీరాడే పయటచెంగు నెత్తినవేసుకొని, పాతచెప్పులజోడు తొడుక్కొని కట్టెలకెళుతోంది కమల. మొహానికి కొడుతున్న వెచ్చటిగాలికి

ఆమె లేతచెక్కిళ్లు కందిపోతున్నాయి. చెమటబిందువులు ఆ కందిన చెక్కిళ్లమీద నుండి నున్నటి నుదిటి మీదికి జారుతూ ముత్యాలసరులులాగ మెరుస్తున్నాయి. రోజూ తారకూడా తోడుగావచ్చేది. దాని బాబుచేయి మిల్లు చక్రంలో పడి నలిగిపోవటంవల్ల కట్టుకడుతూ 'వస్తాను పద'మంది. ఇంకా రావటంలేదు. 'అది ఒట్టి జగడాలమారిది. దారిలో ఎవరితో జగడం పెట్టుకుకూర్చుందో! ఒట్టి నిర్లక్ష్యం!' అని విసుగుకొంటూ పల్లెకేసి పారజూచింది. ఆమె వస్తున్నజాడేలేదు. అడవి దాపునేవుంది. ఒంటిగా వెళదామంటే భయమేసింది. ఎండలో ఎక్కువసేపు నిలబడలేకపోయింది. తొడుక్కున్న చెప్పులు చిల్లులుపడిన వవటంచేత పాదాలు కాలుతున్నాయి. ప్రక్కనున్న పాలచెట్టునీడను కూర్చొని నున్నితమైన నుదిటిమీదపోసిన చెమట బిందువులు ఆ చిరుగుల పయటతో తుడుచుకొంది. తారవస్తోందేమోనని చెయ్యి కంటికి మాటు పెట్టుకొని పల్లెకేసి పారజూచింది. ఇంకా రావటంలేదు. దానిబాబుకి ఎట్లావుందో? అతను మూలబడితే ఇక వాళ్లకి దిక్కులేదు. ఈపాడు మిల్లులు మనుష్యుల రక్తమాంసాలేగాదు మెల్ల మెల్లగా ప్రాణాలేహరిస్తాయి. కొందరిని ఎండబెట్టి కొందరిని నిండబెడతాయి. ఇదెక్కడి న్యాయము? ఎక్కడి సభ్యత? ఇదా నూతనన్యాయం? నవీనసభ్యత! ఆమెకు మిల్లు జ్ఞప్తికిరాగానే భర్త స్మృతికి వచ్చాడు. ఆ స్మృతితోపాటు కంట నీళ్లు నిండుకొచ్చాయి. కొంచెంసేపు ఆ స్మృతుల్లో మునిగిపోయింది. పల్లెకేసి పారజూసింది. తార వస్తున్న జాడేలేదు. ప్రొద్దుకూడా తిరిగిపోయింది.' అని కన్నీళ్లుతుడుచుకొని తిరిగి తిరిగి చూచుకొంటూ అడవికిపోయింది భయంతో—

రోజూ తార చేదోడుగావుంటే లోపలికెళితే మంచిపుల్లలు దొరికేవి. ఒంటిగా పోవటానికి భయమేస్తోంది. రోజూ గొర్రెలమంద లొచ్చేవి. ఆ రోజున అవికూడా ఆ వైపు తొంగిచూడలేదు. దరిమీద ఎండుపుల్లలేమీ లేవు. కత్తికూడా లాక్కున్నారు. పచ్చిపుల్లలు బలవంతాన విరగదీయటంవల్ల ముళ్లుకూడా గుచ్చుకొన్నాయి ఆ మృదుహస్తాలలో. కొంతవరకు విరగదీసింది. మోపు నిండలేదు. ఇంకా విరగదీస్తోంది. ముందు ఏదో గుసగుసలు వినిపించాయి.

'రోగం వదలిపోయింది. ఇక నిలవటానికి నీడలేదు. లేకపోతే లక్షాధికారులతో భిక్షాధికారులకు పంతమా!!'

'పోతే పోకపోతే మారాజులు కడుపునిండా పోయించారు. రోజూ ఇట్లాపోయిస్తే పల్లెలేంటి పట్టణాలకి పట్టణాలు భగ్గుమనిపించొచ్చు'

ఆమె భయంతో తారవస్తోందేమోనని పల్లెకేసి పారజూచింది.

పల్లెఅంతా పొగతో కమ్ముకుపోయింది. నిప్పుకెరటాలు కొంపలమీదనుండి లేచి రాకాసుల్లాగా గాలిలో విహరిస్తున్నాయి. కమలగుండె చెదరిపోయింది. ఇంట్లో బిడ్డ పండుకొన్నాడు. ఈరెండు మూడు రోజులనుండీ మిల్లులో సమ్మెజరుగుతోందనే భయంతో ఇంటినుండి కదలలేదు. ఆవాళే అడుగు బయట పెట్టింది. తనకొంపకూడా ముట్టుకొందేమో! రోజూ పాపణ్ణి చూస్తూండమని ఇంటిదరి ఇల్లాలుతో చెప్పి వచ్చేది. ఆ రోజున ఆమె ఇంటిదగ్గరలేదు. నా పాపడు! నా పాపడు!! అని గొంతుదాటి పైకిరాని స్వరంలో అరచింది. పల్లెకేసి పరుగుదీసింది.

రాళ్లూ, రప్పలూ, పొదలూ, పుట్టలూ ఏమీ ఆమెకు అడ్డంరాలేదు. అన్నీ నీడలే. పరుగుదీస్తోంది.

భయంచేత అవయవాలు స్తంభించిపోతున్నాయి. ముందడుగు పడటంలేదు. పల్లె ఇంకా ఎంతోదూరం లేదన్న స్పృహకూడాలేదు. వేడినిపట్టిచూస్తే తప్ప పంచభూతాలు పల్లెమీదికి దాడి వెడలినట్టుంది. అగ్ని కెరటాలువచ్చి తన కాళ్లముందు పడుతున్నాయి. తన శరీరం కాలిపోయినాసరే, ఎముకలు విరిగిపోయినా సరె, ఒక్కగంతులోపోయి తనబిడ్డను కాపాడుకోవాలనే ఆమెకోరిక.

కాళ్లు తడబడు తున్నాయి. ముందడుగు పడటంలేదు. గాలివిసురికి అగ్ని జ్వాలలు వేయి నాల్కలతో తన్నుకూడా అందుకో జూస్తున్నాయి. తనముందు కొంపలన్నీ కాలిపోతున్నాయి. కొన్ని ఇదివరకే భస్మమైపోయాయి. చెట్లాకులు కమురుకుపోతున్నాయి. హడలిపోయిన జీవరాసులు తమ ప్రాణాల్ని దక్కించుకోటానికి పరుగు లెత్తుచున్నాయి. వసారాలో కట్టేసున్న ఆవుదూడ కూడా పరుగెత్తుకొచ్చింది తనబిడ్డజాడైనా కనుక్కోకుండా. లోకం ఎంతస్వార్థపరమైంది? ఎవరుమట్టుకు వారు తమతమ ఆస్తిపాస్తులను భద్రపరుచుకొంటున్నారు. పిల్లలతల్లులు పడుతూ లేస్తూ తమతమ పిల్లల్ని ఈడ్చుకొంటూ పరుగులెత్తు తున్నారు. ఇంటిదరి ఇల్లాలు తనబిడ్డను చంకనేసుకొని పరుగెత్తుతోంది. తన పసిపాప డేమయ్యాడో!!

నిరాశతో, నిస్పృహతో గొంతుపైకి రాని కీచుగొంతుతో, 'నాపాపడు! నాపాపడు!!' అని అరుస్తూ వెర్రిదానిలా గొందినే పరుగుదీసింది.

'ఎక్కడికి కమలా! అదంతా అగ్నికుండమయితేను' అని మంటల్లోకి చొరబడుతూన్న కమల పయట లాగాడు సౌహాద్రి. ఆమెకు అసహ్యమేసింది. కట్టెలమ్మకోటానికి పోయినప్పుడు ఆ మేడాయన అట్టాగే లాగాడు. పెనగులాడి పయట చించుకొనిపోయింది. కాలుతున్న కొంపలమధ్యకు చేరుకొంది. సాహసించి నిప్పు ముట్టుకోకుండా బట్టలెగబట్టుకొని తన గొందికి పరుగుదీసింది.

మంటలు నలువైపులకూ వ్యాపించి మార్గాల్ని నిరోధిస్తున్నాయి. తన కొంపకు తూర్పునున్న గుడిశెకూడా తగులబడిపోయింది. తనకొంప తగులబడకుండావుంటే తన పాపడు జీవించియుంటే, అంత దుఃఖంలోనూ ఆశపడి, పోలేరమ్మకు పోతునిస్తానని మొక్కుకొంది. ఆఖరికి తనకొంపకూడా ముట్టుకోటం చూచింది. గనగన మండుతోంది. ఆమెగుండె దడదడలాడుతోంది.

కొంపలోకి జొరబడింది. పొగ వూపిరాడకుండా ఉక్కిరిబిక్కిరిచేస్తోంది. వెనుకనుండి మంటలు తరుముకొస్తున్నాయి. పిల్లవాడి మంచంకూడా అంటుకొంది. అగ్నిజ్వాలలు మృత్యుదేవత నాలుకల్లాగా అతన్ని మింగజూస్తున్నాయి. ఆ తాపానికి తాళలేక బిడ్డడు కక్కటిల్లి ఏడుస్తున్నాడు. వాడిఒళ్లంతా ఎర్రగా కందిపోయింది.

కొడుకా! కొడుకా!! అని ఎత్తి హృదయానికి హత్తుకొంది. ఆ వుత్సాహంలో పయట అంటుకొంది కూడా తెలియలా. వసారాకూలి వాకిటికడ్డంగా పడింది. ఇంటికి మరోమార్గంలేదు. మంటలు మృత్యుదేవతలాగా చేతులు జాపుకొంటూ దగ్గరకొస్తున్నాయి. వేడిమికి ఒడలు వుడుకెత్తిపోతోంది. కోటిదేవుళ్లకూ అంతులేని మ్రొక్కులు మ్రొక్కుకొంది. ఎప్పుడు చెల్లిద్దామనో! రోజూ పూజలు పొందుతున్న పోలేరమ్మకు కూడా దయరాలేదు. నన్ను 'రక్షించండి! రక్షించండి!!' కేకలేసింది. ఆ రణగొణధ్వనిలో ఆ దీనాలాపనలు ఎవరికి వినబడతాయి? కాలిపోతున్న బొంగులు టఫ్‌టఫ్‌మని సమాధానమిస్తున్నాయి. ఏడుకొండలవాణ్ణి తలచుకొంది. ఆపత్‌బాంధవుడుకూడా ఆవిణ్ణి అప్పట్లో ఆదరించలేకపోయాడు!

జ్వాలలు దాపుకొస్తున్నాయి. పయట మంట పైకి చేరుకొంది. బిడ్డ నిస్పృహతో వ్రేలాడిపోయాడు. ముద్దుబిడ్డడి లేతబుగ్గలు తన చెక్కిళ్లకద్దుకొని మంటల్లో మిళితమైపోయింది!

---

# మాసూ కన్య వీర జీవితగాథ

శ్రీ పరకాల పట్టాభిరామారావు

అజ్ఞానాంధకారంలో నిద్రపోతుండే జాతిని మేల్కొల్పటానికి చీనా విద్యార్థి యువతీ యువకులు, జపాను దండయాత్రల దురంతాల్ని, చైనా జాతీయవీరుల వీరగాథల్ని, విప్లవచైతన్యం రేకెత్తించే జాతీయ ప్రబోధనాన్ని నాటికల ద్వారా ప్రదర్శించేవారు. ఈ నాటక ప్రదర్శనాల అద్భుత ఫలితాలటుంచి, చీనా విద్యార్థి యువతీ యువకుల వీరజీవితగాథల్ని, పులకిత గాత్రాలతో చైనా జాతీయులు చెబుతుంటారు. పాడుతుంటారు.

అల్లాంటి ఆరాధ్య దేవతల్లో 'మాసూ - కన్య' ఒకతె!

కాళీచేయబడిన ఒక చైనా గ్రామం ద్వారా ఒకజపాన్ సైనికపటాలం వెళుతూంది. ఒకటి రెండు రాతిగుడిసెలు తప్ప ఇళ్లన్నీ అగ్నికాహుతైపోయినై. జపాన్ సైనికులు దోపిడిచేయగా మిగిలిన వస్తువులు వీధుల్లో అక్కడక్కడ అల్లరిచిల్లరగా పడివున్నాయి.

సైన్యం ఊరుదాటి సాగిపోతోంది.

ఒక కొండపక్కనుంచి మరతుపాకీ ఢాం, ఢాం చప్పుడైంది. కొంతమంది జపాన్ సైనికులు చని పోయి పడిపోయారు.

జపాన్ సేనానాయకుడు అజ్ఞయిచ్చాడు. ఒక దళం కొండపైకి ఎక్కనారంభించింది.

ఒక్కటే ఒక్క మరతుపాకీ-నల్గురు యువకచైనా సైనికులు...ఒకదళాన్నా ఎదుర్కొనగల్గేది?...

కొంచెంసేపట్లో మరతుపాకీ చప్పుడు ఆగిపోయింది. నల్గురు చైనా గోరిల్లాసైనికులు యాంగ్ట్సీనది వొడ్డుకి నెట్టుకురాబడ్డారు. అగాధమైన లోతులో ఒడ్లు నొరుసుకొని ప్రవహిస్తోంది నది! తుపాకి గుండ్ల చప్పుడు...ఒకరితర్వాత ఒకరు.... గట్టుమీదపడి నదిలోకి దొర్లిపోయారు.

కాని ఒక ఖైదీ తప్పించుకు పోవటానికి చేసిన ప్రయత్నం ఫలించింది.

నాన్కింగ్ రాష్ట్రంలో ప్రసిద్ధిపొందిన ఈత ఛాంపియన్...మాసూ అనే యువతి ఆమె!

ఆమె తల్లిదండ్రులు, అన్నదమ్ములు జపానుసైనికులచే హత్య చేయబడ్డారు.

మాసూ ఒక గోరిల్లా సైనిక పటాలంలో చేరింది. తుపాకి పేలకుండానే మాసూ క్రిందపడింది. నదిలోకి దొర్లిపోయింది.

అర్ధరాత్రివేళ కరిగి కలిసిపోయిన కారుచీకటిలో మాసూ ఈదుకొని ఆవలిఒడ్డు చేరింది.

కొన్నిరోజులు జపాన్ సైనికపటాలాల చేతుల్లో పడకుండా, దాగుడుమూతలాడుతూ, కొన్ని చైనా సైనిక పటాలాలు ఉండే నాన్సిన్ పట్టణం చేరగలిగింది.

అక్కడ ఉన్న పటాలంకంటే, అయిదురెట్లు సంఖ్యగల జపాన్ సైనికదళాలు ఆ పట్టణంమీద త్వరలో దండెత్తనున్నాయి. శత్రుసైన్యాన్ని ఎదుర్కోవటమంటే నాశనంకావడానికి ప్రయత్నించటమే నని చైనా సైనిక నాయకుడు గ్రహించాడు.

ఎదిరించకుండా పారిపోతే ఆ పట్టణం ప్రజలు జపాన్ రాక్షసుల చేతుల్లోపడి నాశనమైపోతారు!

ముందుకెడితే గొయ్యి. వెనక్కు వెడితే నుయ్యి. సేనాధికారి కిది విషమసమస్య అయిపోయింది.

మాసూ సేనా నాయకుడు, కొంతమంది సైనిక ప్రముఖులు, ఆలోచనచేశారు. ప్లాను సిద్ధమైంది.

పట్టణానికి ఒకవైపున ఒక మురుగుకాల్వ, దానికి ఒక వంతెన, ఉన్నాయి. ఇద్దరుసైనికులు రెండు టైమ్ బాంబులు తీసుకొనిపోయి వంతెనను అమర్చారు.

ఒక గంట పోయిన తర్వాత బాగా అలంకరించుకొన్న ఒక అందాలరాణి వొయ్యారంగా లోలాక్కు ఊపుకుంటూ, కొండమీదనుంచి దిగి పరచిన ఆకుపచ్చ తివాసీలాఉన్న విశాలమైన పచ్చికబయల్లో నడచివెళ్లింది.

ఒకటి రెండు మైళ్ల దూరంలోనే జపాను సైనికదళాలు విడిసిఉన్నాయి.

హంసనడకతో వస్తూన్న ఆ వన్నెల విసనకర్ర సమీపించటంతోనే సైనికులు దిగ్భ్రమతో నిలుచుండిపోయారు ముగ్ధులైపోయి!

కళ్లు తిప్పుతూ అడిగింది 'సేనానాయకుడెక్కడ?' అని.

సైనికులు తోసుకుంటూ వస్తున్నారు. చాలా స్పష్టంగా, ఆకర్షణీయంగా ఉన్నాయి ఆమె మాటలు. మంత్రముగ్ధులై వింటున్నారు సైనికులు!

'మా నాన్న ఓడల్లో అధికారి. జపాన్ సైన్యాలకు ఆయుధాలు తయారుచేస్తుండేవాడు. ఈ చైనా రాక్షసులు మా ఇల్లు తగులబెట్టి, మా కుటుంబాన్నంతా హత్యాకాండ చేశారు. దుర్మార్గులు! అందుకు ప్రతీకారం చేద్దామనే ఉద్దేశ్యమే నన్నిక్కడికి రప్పించింది.' ఆ అమ్మాయి బుగ్గలు ఎఱ్ఱబడ్డాయి.

సేనానాయకుడు ఓసారి మీసాలు సవరించుకున్నాడు.

'మీరు పట్టణంలోకి మామూలు దోవనవెళ్లితే ప్రమాదం వుండవచ్చును. అందుకు నేనో మంచి ప్లాన్ వేశాను. పట్టణంలోకి వెళ్లటానికి ఎవరికి తెలియని ఒకమారుమూల దోవ వుంది. ఆ దోవలో మిమ్మల్ని సురక్షితంగా తీసుకుపోగలను. అకస్మాత్తుగ పట్టణంలో ప్రవేశించి మీరు సునాయాసంగా విజయం పొంద వచ్చును.' ఒక దీర్ఘ నిశ్వాసం విడిచింది ఆ పడుచు.

'ఈనాటితో నా ప్రతీకారంకూడా తీరిపోతుంది.'

ఆమెకళ్లలో ఏదో కాంతి మెఱసింది. పైకి చిఱునవ్వు పండిస్తూన్న ఆ ఎఱ్ఱటిపెదవులు తీవ్ర ప్రతీకాంక్షతోటి అదిరినై.

ఆ కన్నెపడుచు కథ చాలనమ్మకంగా తోచింది జపాన్ సైనికాధికారికి!

ఆ అమ్మాయే మాసూకన్య!

ఆమె ముందు నడిచింది రిట్టువాచి చూసుకుంటూను. ఆమెవెనుక సేనానాయకుడు నడుస్తూన్నాడు ఏవో కలలుకంటూను. అతని వెనకాల జపాన్ సైనికదళం సాగింది.

వంతెన సమీపించింది! మాసూ శరీరం ఉద్వేగంతో చలించిపోతోంది! ప్రతీకారం!...ఆమెలో మరిగిపోతున్నాయి అక్షరాలు!

జపాన్ రాక్షసుల అమానుషకృత్యాలు, రక్తం ఉడికిపోయే దురంతాలు, జపాను బాంబులకు రక్తబలి తర్పణంగా ఎంత మంది గర్భవతులు, నీళ్లాడే స్త్రీలు...ఎన్ని కళ్లుతెరవని పసిగుడ్లు ఆహుతి అయిపోయారు! ఎన్ని రోగుల ఆసుపత్రులు, కళాశాలలు, పల్లెటూళ్లు నాశనం చేయబడ్డాయి!

మరోచోట 20 మంది జపాన్ సైనికులు ఒకరితర్వాత ఒకరు, ఒక చీనా యువతిని...అబ్బా ఘోరం, రోజూ లెఖలేనన్ని అత్యాచారాలు!

దినదినం పెచ్చు పెరిగిపోతున్న ఈ దారుణహత్యకి...ప్రతీకారం! ప్రతీకారం!!

మాసూ తన చేతిగడియారం చూసుకుంది, ఆఖరి సెకండు దాటిపోయింది.

పిడికిలి బిగించి పైకెత్తి వెనక్కి తిరిగింది. ఘట్టిగా అఱచింది!

'ప్రతీకారం! నాతండ్రి సోదరుల హత్యలికి ప్రతీకారం! లక్షలకొలది అమాయిక ప్రజల దారుణ హత్యలికి ప్రతీకారం! మాతృదేశంకోసం ప్రతీకారం!'

ఆమె చివరిమాటలు బాంబుల భయంకరధ్వనుల్లో కలిసిపోయాయి.

ఆ తీవ్ర ఉద్వేగంలో తన రక్షణమాట మరచిపోయింది మాసూ!

గాలిలో కెగిరిన జపాన్ సైనికుల శరీరపు ముక్కల్లో మాసూ శరీరం ఎక్కడో మాయమైపోయింది.

మాసూ మహత్తరత్యాగం నాన్కిన్ పట్టణాన్ని, చైనా దళాల్ని, వేలకొలది ప్రజల ప్రాణాల్ని రక్షించింది.

వీరి జీవితగాధ చైనాజాతికి అద్భుత జీవచైతన్యాన్ని కలిగించింది. మాసూ వీర కార్యకలాపాల్ని యుద్ధరంగాల్లో గొంతెత్తి పాడుకొంటూరు చీనా యువతీ యువకులు!

మనదేశంలోనో...'మాసూ'లు....

---

# పతివ్రత!

మ. సతతాచార సముంచితోరుగుణినీ! సత్యవ్రతాలాపినీ!
గతమాత్సర్య మదక్రుధాదిగుణినీ! జ్ఞానోజ్వలోన్నత్యతా
పతి పాదాంబురుహద్వయావిరత ప్రాప్తప్రార్థనాభీష్ట సం
స్తుత సాధుత్వ పతివ్రతామజననీ! సుస్తోత్రసంకల్పినీ!

ఉ. సార విహీన సంసరణ సాగర సాధు మనో సహిష్ణుతా
సార తరీ సదృక్షమయి, సద్మ మనోరమ మంజు మంజులా
చారు ప్రబర్హ లక్ష్మినయి, సంతత భర్త పదర్చితాత్మవై,
ధీరముగా మెలంగెదవు దివ్య పవిత్రవతీ పతివ్రతా!

చ. అనుపమ ధర్మభావమును యాచకులందునుఁ జూపుచుండియున్
యనవరతంబుఁ బ్రాణపతి నాదరమొప్పఁగఁ బూజసేయుచున్
కన, పరకాముకాళికిని కర్కశ భావ బిలేశయంబుఁగా
ననిశము మెల్గుచుండెదవు యంచిత సచ్చరితా పతివ్రతా!

—దల్లా రాధాకృష్ణమూర్తి.

# రాధ

శ్రీ పోలిశెట్టి వేంకట నాగేశ్వరరావు

కృష్ణుడు భావప్రపంచంలో విహరిస్తూ ప్రేమగీతాలు అల్లుకుంటున్నాడు. చక్కగా సింగారించుకుని రాధ వెనకాల వచ్చి నిల్చుంది. కృష్ణుడు రాధను చూడలేదు. నవ్వుకుంటూ నోటిలో మాట్లాడుకుంటూ వ్రాసుకుంటున్నాడు. రాధ కొంతసేపు చూచి కళ్లు మూసింది. చేతులు వదలించుకొని ప్రక్కకు చూచాడు. రాధ పకపక నవ్వుతూ నిలబడింది.

'ఓహో...తమరా...ఎవరో అనుకున్నాను.'

'ఆ... నేనే. ఇప్పటికైనా యీ లోకంలోకి వచ్చారా? ఎవరితో ఆ మాటలు?'

'ఇంకెవరుంటారు? రాధతోనే.'

'రాధతోనా...ఏ రాధ?' అని అసూయతో ముఖం చిట్లించుకొని అడిగింది.

'ఎరుగవూ? నేను ప్రేమించిన రాధ.'

'ప్రేమించిన రాధా. ఎవరబ్బా ఆ రాధ?'

'ప్రేమించడమే కాదు. పెళ్లికూడా చేసుకోబోతున్నాను.'

'అయితే ఎక్కడ వుంటుందేమిటి ఆ రాధ?'

'ఉండేచోటే వుంటుంది. తమకెందుకులెండి ఆ వివరాలన్నీ!'

'అబ్బా! చెప్పు బావా! చెప్పవూ?' అని దీనంగా అడిగింది.

'చెప్పనా? ఆ రాధ భావప్రపంచంలో వుంటుంది.'

'భావప్రపంచం అంటే ఎలావుంటుంది?'

'చక్కగా, నీలాగే వుంటుంది.'

'చక్కగా అంటే అక్కడేమి వుంటాయేమిటి?'

'అన్నీ వుంటాయి. వెన్నెల రాత్రులు, తళతళ మెరిసే పర్వతాలు, వాటిపైనుండి జలజల రాలే జలపాతాలు వుంటాయి. వాటిని ఆనుకొని, అల్లిబిల్లిగా అల్లుకొనే లతలతో, పచ్చని ఆకులమధ్యనుండి అందంగా తొంగిచూసే పుష్పాలతో నిండివుండే వనాలుంటాయి. అక్కడే వుంటుంది నీలాంటి రాధ.'

'కృష్ణుడో మరి.'

'రాధ అక్కడవుంటే కృష్ణుడు ఎక్కడికిపోతాడు?'

రాధ రెప్పవాల్చకుండా చూస్తూ ఆలోచిస్తోంది.

'వెర్రి అమ్మాయీ! ఆ రాధ ఎవరనుకున్నావ్? నువ్వే.' అని బుగ్గమీద వ్రేళ్లతో తట్టాడు 'అబ్బా. నేనేనా?' అని నవ్వింది. 'నిల్చున్నావేం? కూర్చో రాధా' అనగానే కూర్చుంది.

'తమరేదో పనిమీద దయచేసినట్టున్నారే?'

'చిత్తం. ఈ జేబురుమాలుమీద బొమ్మ వేసివ్వండి. త్వరగా పోయి కుట్టుకోవాలి.'

'ఏమిటా తొందర. వేసిస్తాను గాని, నేనొకటి అడుగుతా యిస్తావా?'

'తప్పకుండా యిస్తాను.'

'అయితే లేచి నిలబడు.'

'ఊ.........'

'ఇలా దగ్గరకు రా.'

'ఊ.........'

'ముఖం ప్రక్కకు తిప్పు' ఏమిటీ మిలిటరీ డ్రిల్లు అని మూతి బిడాయించుకొని వెళ్లిపోతూవుంది.

'రాధా...రాధా...యిలారా. మూతికి తాళంవేసుకున్నావేం? నామీద నీకు కోపంవచ్చిందా?' అని పిలచి బొమ్మ వేసిస్తున్నాడు.

'పిచ్చి అమ్మాయీ. అంత కోపంవస్తే ఎలా చెప్పు? ఇదుగో మకరందంతో గూడిన పుష్పం. ఇదుగో దీనిపైన భ్రమరం. పుష్పంలోని తియ్యదనాన్ని త్రాగి ఎలా ఆనందిస్తోందో చూచావా? అంగము నాకేకదా వుందని నీలాగ వికసించకుండా మూతిముడుచుకొని కూర్చుందా?'

'అవును. నిజమే. పాపం భ్రమరము వచ్చిందికదా అని ఎంతో సంతోషంగా నవ్వుతుంది. నమ్మి సర్వం అర్పించేస్తుంది. కాని త్రాగి ఆనందం అనుభవించేవఱకు వుండి యింకో పుష్పందగ్గరకు పోతుందని దానికేమి తెలుసు? అమాయకురాలు! వికసించి నవ్వదూ?'

'చాలా గొప్పగా మాట్లాడావే? నీకు నేను సమాధానము చెప్పలేను గాని...వుండు యీ సంగతి దానికి చెబుతాను. 'ఓ భ్రమరమా! మా రాధ చెప్పే సలహా విను, బాగుపడతావు. లేకపోతే ఎందుకూ పనికి రాకుండా పోతావ్. నీవు వ్రాలే పుష్పం ఎంత కోపగించుకొన్నా, ఎంత నవ్వమన్నా నవ్వకుండా మూతి బిడాయించుకొన్నా, నీవే యీ ప్రపంచంలో నాకు దిక్కు. ఇంకేపుష్పం నాకు దొరకదు. అని బ్రతిమాలుకో, లేకపోతే మా రాధ నిన్ను అన్ని పువ్వుల్లో దూరేరకం అనేస్తుంది.' చెప్పాను...చాలా.'

'ఆ...చాలు' అని వచ్చేనవ్వు ఆపుకొంటూ 'మరే.'

'మేమంతా సినీమాకు వెళుతున్నాం. నువ్వుకూడా వస్తావా.'

'ఆ...సినేమా ఏమిటి చూసేదిగాని, వాళ్లందరిని వెళ్లనియ్, ఏ తలనొప్పో అని నువ్వు ఆగిపో.'

'చిత్తం' అని జేబురుమాలు తీసుకొని మెరుపులాగ మెరసి వెళ్లిపోయింది.

కృష్ణుడు సెలవలు ఆఖరైపోవడంచేత కాకినాడ వెళ్లిపోతూ రాధతో చెప్పడానికి వచ్చాడు. అప్పుడే రాధ 'ఓ గొబ్బెమ్మా...మా బావ యీ ఏడు బి. ఏ. ప్యాసయితే నీకు ఎన్నో కొబ్బరికాయలు కొట్టాను.' అని దణ్ణం పెడుతూవుంది. 'రాధా వెళ్లివస్తాను.' అని చెప్పి కృష్ణుడు బండి ఎక్కాడు. రాధ గుమ్మానికి జేరబడి కంట నీరు కారుస్తూ అతనివంక చూస్తూవుంది. క్రమముగా ఆ బండి రాధకు కృష్ణుడిని దూరం చేసింది.

కృష్ణుని తండ్రి డబ్బుగలవాడు. కాని డబ్బుకి గడ్డితినేమనిషి. కొడుకుని చదివించిన డబ్బంతా కట్నం ద్వారా రాబట్టుకోవాలని ఆశతో కూర్చున్నాడు. రాధ కృష్ణుడి మేనత్త కూతురవడంవల్ల చిన్నప్పటినుంచీ, వారిద్దరికీ పెళ్లిచెయ్యాలని అనుకొనేవారు. ఒకరోజున రాధ తండ్రి అతనిని పెళ్లివిషయమై అడిగాడు. ఆయన రెండువేల రూపాయలు కట్నం అడిగాడు. రాధ తండ్రికి మ్యునిసిపాల్టీలో 40 రూపాయల వుద్యోగమగుటచేత నేనివ్వలేనన్నాడు. రాధ తల్లికూడా వెళ్లి అన్నను బ్రతిమాలింది. లాభంలేకపోయింది. రాధకు యింకొక సంబంధము చూసాడు తండ్రి. రాధ తల్లిదండ్రులను యింకొక సంబంధము చూడవద్దని బ్రతిమాలింది కాని, వారామాటలను లెక్కచేయలేదు.

రాధకు పెండ్లయి రెండునెలలయ్యింది. అప్పట్నుంచి రాధ అదొకమాదిరిగా మారిపోయింది. కృష్ణుడు పుస్తకాలను పట్టుకొని, పైకి చూస్తూ ఆలోచిస్తూవుండేది. నలుగురిలోకి వచ్చి మాట్లాడ్డడం మానేసింది. క్రమక్రమముగా రాధ మంచంపట్టింది. ఎంతమందో డాక్టర్లు ఎన్నో మందులిచ్చారు. గుండెల్లో మంట తగ్గలేదు. 'కృష్ణా...కృష్ణా' అని రాధ మూల్గుతూవుంది. 'కృష్ణా...కృష్ణా' అనే యింత కొంప ముంచావ్! 'యికనైనా మర్చిపో' అంది రాధ తల్లి.

'అమ్మా బావని కాదే...దేవుడ్ని తలుచుకుంటున్నాను.' అని రాధ సర్దుకొంది. 'వాడి కట్నం తగలబెట్ట! నీవుసురు పోసుకున్నాడమ్మ' అని రాధ తల్లి కంట నీరు పెట్టుకొంది. రాధతండ్రి ప్రక్కన కూర్చున్నాడు విచారిస్తూ.

'నాన్నా బావను పిలిపించు, నీకెంతో పుణ్యం వుంటుంది. నాన్నా నీకు దణ్ణంపెడతాను. బావను చూసి ప్రాణం వదుల్తాను.' అని అడిగింది. 'అమ్మా, యిదుగో టెలిగ్రాం యిస్తున్నాను. పడుకో తల్లి యిప్పుడే వస్తాను.' అని కంటినీరు తుడుచుకుంటూ వెళ్లిపోయాడు.

భయంకర స్వరూపంతో రాత్రి ప్రారంభ మయ్యింది. చెట్లు విచారంగా తలలూపుతున్నాయి. అప్పుడే తీతువ పిట్ట కూసుకుంటూ యింటి మీదుగా వెళ్లిపోయింది. రాధ మూల్గుతూవుంది. కృష్ణుడు యింట్లోకి పరుగెత్తుకొనిపోయి మంచంమీద కూర్చున్నాడు.

'రాధా...రాధా, యిటు చూడు' అని కన్నీళ్లుకారుస్తూ చెయ్యిపట్టుకున్నాడు.

'వచ్చావా...బావా...వచ్చావా' అని కన్నీళ్లు కారుస్తూ ముఖంలోకి తొంగిచూచింది.

'బావా నన్ను క్షమించు...నిన్ను మోసంచేసాను'

'రాధా, నీది తప్పుగాదు. నాతండ్రిది. ధనదాహంతో మనప్రాణాలు తీసుకున్నాడు రాధా'

'బావా! నువ్వు యింకా దగ్గరగా రా. నాగుండెల్లో మంట చల్లబడుతుంది.' అని కృష్ణుడి వడిలో తలపెట్టుకొని చూస్తూవుంది.

'అబ్బా రాధా, నీ అందం మటుమాయ మయ్యిందా? కాదు. రాధా, నిన్ను వివాహంచేసుకొని మన ప్రేమలతతో కైలాసగిరిని అందుకుందా మనుకున్నాను. ఒక ఆదర్శ జీవితాన్ని ఈ పాడుప్రపంచానికి చూపించుదా మనుకున్నాను. మనమిద్దరమూ ప్రేమకుసుమాలతో పూలదండను కట్టుకున్నాము. కాని... రాధా...కాని...నాతండ్రి ధనదాహంతో ఆ దండను తెంపేశాడు. హృదయంలేని సంఘానికి, అర్థంలేని

కట్నపిశాచానికి మనప్రాణాలు బలైపోయినయ్. రాధా...పద వెళ్లిపోదాం. ఈ పాడుసంఘంలో వుండే కంటే...ఆ నరకలోకంలోకే పోదాం పద. అదే బాగుంటుంది, దీనికంటే.'

'బావా! ఈ విశాల ప్రపంచంలో అనేక సుందరమైన నావంటి రాధలు ఎంతమందో వున్నారు. పెళ్లిచేసుకుంటానని నా చేతిలో చెయ్యివెయ్యి. నేను సుఖంగా కళ్లుమూసుకుంటాను. నీవలా దుఃఖమయ జీవితాన్ని గడిపితే నామనస్సుకు శాంతివుండదు.' అని గడ్డం పట్టుకుంది.

'రాధా! యిసుకలాగవున్న నాహృదయంలో నిప్పులు జల్లుతావా? రాధా...నీవులేని ఈ పాడు ప్రపంచంలో నన్నింకా బ్రతుకమంటావా? రాధా...నీసౌందర్యాన్ని కాదే ప్రేమిస్త. రాధా, నీ శీలాన్ని ప్రేమించాను. నాహృదయం కృత్రిమ ప్రేమకు స్థానం కాదు. కళంకరహితమైన ప్రేమకు స్థానం. ఆ వెన్నెల రాత్రిలో నిన్నుతప్ప ఎవరినీ వివాహంచేసుకోనన్నాను. జ్ఞాపకం వుందా?'

'బావా... నేను పెళ్లిచేసుకొని నిన్ను మోసంచేసాను. నీకు జీవితాంతము దుఃఖం కలిగించాను. నిన్ను పెళ్లిచేసుకోడానికి ఎన్నోప్రయత్నాలు చేసాను. కాని నా విధినిర్ణయం యిలావుంది. నీ రాధను కాలేకపోయాను. నేనింక మాట్లాడలే' నని కృష్ణుడి తలను హృదయానికి జేర్చుకొని బావా...బావా...అంటూ నీలాకాశంలో కలిసిపోయింది.

ఏడ్పులు విని కృష్ణుడి తండ్రి వచ్చి నిల్చున్నాడు. 'వచ్చావా నాన్నా...నా రాధను నీ కట్న పిశాచానికి ఆహుతిచేశావా నాన్నా? నన్ను అమ్ముకొని జీవిద్దామనుకొన్నావా? వెఱ్ఱినాన్నా! అన్యాయంగా నా రాధ వుసురు పోసుకున్నావు!' అని పాపం కృష్ణుడు మంచం ఎక్కాడు.

# పోలిక

గీ. పలుకుచుండును వీనులు కులుకురీతి,
వినిన ముదమును పుట్టించు వింతకూత;
పోల్చిజూడగ కాకిని పోలియుండుఁ
గోరిచూడఁగ నాపక్షికోకిలంద్రు॥

గీ. అట్లె జ్ఞానిఁజూడఁగ నవనియందు,
మంచిమార్గమునందున మసలుచుండు;
పోల్చ రూపమున్ మూర్ఖునిపోలియుండు,
వారి నడతలు వారలన్వేరుచేయు.

గీ. దాత లుబ్ధుల పోలిక ధరణియందు
యించుకైనను భేదము గాంచలేము;
కాని వారలుఁ జేసెడి కార్యములను
పోల్చ వేర్వేరుబిరుదులు పొందుచుంద్రు.

గీ. అట్లె మూఢుని పండితున్ అరసిచూడ,
పోల్కెయందును మూఢునిపోలియుండు;
కాని పాండిత్యమందును గాంచగాను
బడయు పండితుఁడనుపేరుపుడమియందు.

గీ. ఎంచ భూతలమందున నెల్లజనులఁ
బోల్కెమాత్రాన ఘనుఁడని పోల్చదగదు
జ్ఞాన యజ్ఞానములు రెండుఁ గానవలయు
దీనిసూత్రము డెందమా తెలుసుకొనుము.

—డి. శకుంతలాదేవి,

# దృష్టి

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

భగవన్నిర్మితమగు ప్రకృతినిచూచి యానందించుటకు కాబోలు కన్నులేర్పడినవి. దానఁ దృష్టి కలుగుచున్నది. 'దృశిర్ ప్రేక్షణే' దీనిచేత చూడబడును గాన దృష్టి యను పద మేర్పడినది. 'సర్వేంద్రియాణాం నయనమ్ ప్రధాన'మ్మని సర్వజ్ఞుల మతము. నిజమునకా కన్నులే లేనిచో నంతయు నంధకారబంధురమే. గ్రుడ్డివాఁ డేమి చూడగలఁడు? చూడక యేమి యానందింపగలఁడు? కన్నులులేని కొఱంత దీర్పరానిది.

చూపులకు దృష్టి యందము. దృష్టులలో ననేక విధములున్నవి. వక్రదృష్టి, వాడిదృష్టి, వ్యంగ్యదృష్టి, విలాసదృష్టి, వెఱ్ఱిదృష్టి, చకితదృష్టి, చంచలదృష్టి, ధీరదృష్టి, దయాదృష్టి, గాంభీర్యదృష్టి, దీనదృష్టి, యెన్నేనియుఁ గలవు. వక్రదృష్టి చాలవఱకు దొంగ పెద్దమనుష్యుల కుండియుండును. కలహోత్కంఠితలకు వాడిదృష్టి నైజమందురు. విలాసవతులకు విలాసదృష్టి. జవ్వనులకు చకితదృష్టి. తనకు సరిపడని పొరుగింటి గృహలక్ష్మి యాధిక్యతను చూచునప్పుడు వ్యంగ్యదృష్టి. నూతనవధూవరులకు లజ్జాదృష్టి. అధికారికి దంభదృష్టి. భగవంతునిది దయాదృష్టి. న్యాయవాది కోర్టులో నడ్డసవాలువేసి యడుగునప్పుడు తప్పుడు సాక్ష్యమిచ్చువానిది వెఱ్ఱిదృష్టి. అతి వినయవంతుల కహరహము దీనదృష్టులే. అందఱ కన్నిదృష్టులు. ఒకరి కందముగానున్న వస్తువు మఱొకరి కసహ్యముగా దోచుట దృష్టిభేదముననే యనవచ్చును. దూరదృష్టిగలవారు మాత్రము ప్రపంచమున బోర్లగిలపడక నెగ్గిరాగలుగుచున్నారు. కొందఱకు పగ లగుపడదు. దూరముననున్న వస్తువులను కొందఱు చూడజాలరు. దగ్గఱిచూపు కొందఱకుండును. (Short sight & Long sight) కొందఱకు నేల చూపులు. కొందఱ చూపు లాకసమున నుండును.

వీరలకు సులోచనముల సాయ మవసరము. సొగసుకు కంటిజోడు తగిలించుకొనువారు లేకపోలేదు. దృష్టిలోపములను సవరించుకొనుటకు నేటి శాస్త్రజ్ఞులు సులోచనముల నమర్చియున్నారు. పూర్వకాలము వారేమి చేయుచుండిరో? ప్రాయశః పూర్వులకు దృష్టి వ్యత్యాసము లేమియు నుండియుండవేమో!

సామాన్యముగా జంతువులకు మానవులకు రెండుకన్నులున్నవి. ఈశ్వరుఁడు ఫాలనేత్రుడని ప్రతీతి. ఇంద్రుఁడు సహస్రాక్షుఁడు. అసురగురు నేకాక్షి యందురు. నిజమున క్రమమగు కనులుగలవారు దేవతలయందున్నారు. మానవులెల్లర కిందు భిన్నత్వములేదు. మూడుకనులు గలవారుగాని, సహస్రాక్షులు కాని మనలో లేరు. దురదృష్టమున నేకాక్షులున్నారు. ఈ సందర్భమున తెనాలిరామకృష్ణుని పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది.

'అన్నాతిగూడ హరుఁడగు
అన్నాతిని గూడకున్న నసురగురుండౌ
నన్నాతిరుమలరాయా,
కన్నొక్కటిలేదుగాని - కంతుడుగావే.'

రెండుకనులున్న మంచిదృష్టియుండునని మనయూహ. కనులు బాగున్నను దృష్టి వ్యత్యస్తముగా నుండువారు సహితమున్నారు. ఏదేని చిత్రమును చూడవలసివచ్చునపుడు మనకు రెండుకన్నులు చాలవు.

మాటలతోనేగాక దృక్కులతోగూడ భావప్రకటనము చేయగలుగుచున్నాము. నేత్రావధాన మిందులకు నిదర్శనము. భర్త గంటవైపుచూచి తన్నుచూడగనే యతిథులకు కాఫీతెచ్చియిచ్చు భార్యలున్నారు. భావము ననుసరించి దృష్టులకు వన్నె వచ్చుచున్నది. కోపముకలిగి తీవ్రభావము వెలిబుచ్చవలసి వచ్చిన చుఱచుఱఁజూచుట నైజము. శాంతిమయదృష్టి కరుణారసముఁ జిమ్ముచుండును. దొంగభావమున దృష్టి వక్రగామియగుచుండును. యుద్ధములలో వీరవిహారముసలుపు సైనికులకు రౌద్రదృష్టి. ఈశ్వరుఁడు మూడవ దృష్టి ప్రయోగించినంతనే మన్మథుఁడు మండిపోయెనట. మనము లోచనదృష్టులు రెండు సులోచన దృష్టులు రెండు, నాలుగు ప్రయోగించినను సిగరెట్టుసైతము కాలకుండుట శోచనీయము. ఈ దృక్కులనే సనాతనాధునాతన సంస్కృతాంధ్రకవు లనేకు లనేకవిధములుగా వర్ణించియున్నారు. ఎంతటి ప్రాముఖ్యము లేనిదే వీని కింతటి వర్ణనాతీతమగు గౌరవము లభించియుండెడిదా?

తులసితీర్థము పారణచేసి తన్నవమానించెనని యంబరీషునిపైఁ గోపించిన దూర్వాసుఁడు 'పెటపెట పండ్లు గీటుచును భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్ పాటపాటరాల' చూచెను. 'కనదనలోగ్రస్ఫులింగకలితేక్షణులై' కొందఱు పోరిరి. కోపము వచ్చినంతనే దృష్టులనుండి నిప్పులురాలుట పూర్వులకు సహజమైయుండెనేమో! కాని కనీసము నిప్పులవలెనైనను కన్నులఁజేసి యకాల సంధ్యారాగమునైనను కల్పించుచుండిరి. నరకాసుర వధావసరమున సత్యభామ వీరశృంగారభావము లొకేసమయమున దృక్కులలో ప్రకటించెను.

'పరుజూచున్ వరుజూచు నొంప నలరింపన్ గోప రాగోదయా
విరతభ్రూకుటి, మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ కన్నులకెంపు, సొంపు బరగన్ చండాస్త్రసందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ చంద్రాస్య హేలాగతిన్.'

అదే సత్యభామ పారిజాత వృత్తాంతమునువిని చెలివైపు 'హెచ్చిన కనుదోయికెంపు దనచెక్కుల కుంకుమపత్రభంగ సంజనిత నవీనకాంతి' వెదజల్లగ చూచెను. 'అలుకమానవుగదా యికనైన నరాళకుంతలా' అని బ్రతిమాలు నేస్తంపు గేస్తుని 'జంకెన నెఱజూపు' చూచినది. నంది తిమ్మనగారు సత్యభామచే చాల చూపులు చూపించినారు. చేమకూరవారును తమ చిత్రాంగిచే 'సొలపుఁబిసాళి వాలు తెలిజూపుల' చూపించిరి.

సాధారణముగా స్త్రీలచూపులు మన్మథబాణములకు సాటిచెప్పుట పరిపాటియైనది. బాణవేగము, తీవ్రతయు వానికున్నదని యాదిశంకరులు 'కశ్శూరో? యో లలనాలోచనబాణై ర్నచవ్యథితః' అని లోచనములను బాణములుగా చేసెను.

కొందఱ దృష్టికి తీవ్రత యెక్కుడు. చూచినంతనే జ్వరమువచ్చుటగాని, చూడఁబడిన వస్తువులు చెడిపోవుటగాని తటస్థించును. దీనినే దృష్టితగులుట యందురు. దీనిపై మనలో చాలమందికి నమ్మకమున్నది. దీని తర్వాతనే కాబోలు దృష్టిమంత్రము, దృష్టివిభూతి మొదలగునవి యేర్పడినవి. మహారాజుల దృష్టి బహుతీవ్ర లక్షణముగలదని ప్రతీతి. దానఁజేసి వారు బయటికి రాగానే యొకక్రొత్త పోరువ వారిముఖమున కెదురుగఁజించివైతురు. ఇట్టియాచారమిప్పుడున్నదో లేదో.

దృష్టి కొంతదూరము మాత్రము పాఱును. 'కనుచూపు మేఱ వఱకని' దాని కవధి నొకదానిని గల్పించిరి. చూపునకేదేని యడ్డము వచ్చిన దానిని జొచ్చుకొని యవలకేగు సామర్థ్యములేదు. దూరమున నున్న పదార్థము దగ్గఱగా కనబడుటకును సూక్ష్మాతి సూక్ష్మవస్తువులు సైతము కంటికగపడునట్లును చేయగల యద్దముల నిప్పటిశాస్త్రజ్ఞులు నిర్మించియున్నారు. గుఱ్ఱపు పందెములుగాని, క్రికెటుపందెములుగాని చూడబోవు వారు దూరపువస్తువులను దగ్గఱగా కనుబఱచు నద్దముల (బైనాకులర్స్) కలిగియుందురు. దూరదృశ్యముల దగ్గఱకుతెచ్చు Field glasses యిప్పటి సైనికుల కవసరము.

మానసికదృష్టిలేని బహిరంగ దృష్టి నేతిబీరకాయ వంటిది. మనసొకచోట నున్నప్పుడు మనకన్నుల యెదుట జరుగుచున్న చిన్నవిషయములఁగూడ మనము జూడజాలము. చూడజాలమన్న మనకు దృష్టి మధ్యమని కాదు. మన కావిషయముపై లేదు. బహిరంగ దృష్టి కందని వస్తువును మానసికముగా మనము చూడగలుగు చున్నాము. మనోదృష్టి లేక కనులతో నేద్దానినైనను చూడజాలము.

బాహ్యదృష్టికి మేఱయున్నదని చెప్పితిని. మనోదృష్టి విహరించునది విశాలభూమి. దీని కందని విషయముండదు. మనపూర్వులకు దివ్యదృష్టి యుండెడిది. యిప్పటి 'టెలివిషన్'ను దివ్యదృష్టికి ప్రత్యామ్నాయముగా భావింపవచ్చు. ఆ దృష్టితో దుర్గ్రాహ్యములగు విషయములు సుగమములగుట చూచుచున్నాము. ప్రాపంచక విషయములఁ జూచుటతోనే మనదృష్టిని నిమగ్నముగావించినచో మనస్సునకు ప్రాపంచకములు తప్ప తక్కినవి దుర్జ్ఞేయములగుచున్నవి. 'యద్దృశ్యం తన్నశ్య' మన్నట్లు నశ్వరమని యెఱింగియు బాహ్యమును చూచుటతోనే మనదృష్టిని సంతోష పెట్టుచున్నాము. 'సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు' అని పోతన ఘోషించెను. ప్రపంచమునుజూచు చూడ్కులు చూడ్కులని యెవ్వరును చెప్పలేదు. చూచియు లాభముండని వస్తువుల నేల చూడవలయును? అటులని కనులుమూసికొన్న పనులు సాగునా? 'చూడఁడే నాపాటు చూపులలోఁ జూపు చూచువారల కృపఁజూచు వాఁడు' దృష్టిని విచ్చలవిడిగ ప్రాకి పోనీయక మరలించి తన్నుదాఁ జూచిన నంతకన్న దర్శనీయముండదు. అట్టి దృష్టిగలవా రిహపరసౌఖ్యములందు చున్నారు. 'సర్వస్మిన్నపి పశ్యాత్మాన'మ్మని శంకరాచార్య వచనము.

---

# పృథ్వీ ప్రశస్తి

శ్రీ రజనీకాంతరావు

పృథులక్ష్మమాశాలినీ పృథ్వీమాతా
గగనపథస్వేచ్ఛాగామినీ కాంతిప్రపూతా
శశ్వన్నవరాగ నవోషస్తేజస్వినీ
అనశ్వరవిస్వరాంధఘనసంతమస్వినీ
ప్రచలదంతరుజ్జ్వలజ్జ్వలజ్జ్వాలామాలినీ
అచలశాంతిమయతుహినాంబరధారిణి ధారుణీ
నందితశతసహస్రహృన్నందనమధుకలస్వనీ
క్రందితశతకోటిక్లాంతబృందశోకవికిరధ్వనీ

వినయముగ్ధ ప్రణయస్నిగ్ధ విస్మృతసుహృన్మణీ
విద్వేషవిభేదవాదవికలప్రకృతిఖనీ
నిరవధికవికారిణీ నిస్తులనిత్యా
సత్యసౌందర్యప్రస్తారిణీ
దిక్కాలాతీత దివ్యశరీరిణీ ధరణీ
పృథులక్ష్మమాశాలినీ పృథ్వీమాతా
గగనపథస్వేచ్ఛాగామినీ కాంతిప్రపూతా

('శాంతిశోధ' నుండి)




## మెడ

విపరీతముగ నగలను మెడచుట్టు ధరించుటచే సహజముగ మెడకుగల యందమును కప్పిపుచ్చుట యగుచున్నదని గ్రహించిన యీరోజులలో అందమగు మెడను కలిగియుండవలసిన అవసరము నంతగా నొక్కి చెప్ప నవసరములేదు. మెడ లావుగా కండపట్టియున్నను, సన్నబారి యున్నను మర్దన చేయుటచే గుణము కలుగును. లావుగనున్న మెడపైనున్న కండరములను బొటనవ్రేలితోను పట్టుకొని యటూ నిటు త్రిప్పి తరువాత వ్రేలి కొనలతో పైకి క్రిందికి రాసినచో కొంతకాలమునకు అవి గట్టిబారి యందమును చేకూర్చును. కండలేక ఎండిపోయినట్లున్న మెడపై ఆల్మండునూనె కలిపిన వేసలైను మర్దన చేసినచో కండపట్టును. కండను పెంచు నూనెలలో కాడ్లివరాయిలు మొదటిది. ఆ నూనె వాసనను సహింపగలిగినచో దానిని మర్దన చేసినచో యత్యంత గుణదాయకమై చక్కని మెడను చేకూర్చును. ఈ నూనెవలన మెడపై వెంట్రుకలు వృద్ధి జెందునని భయపడ నవసరములేదు. కాని పలుచని మెడ గలవారికి శరీరముకూడ పలుచగా, నీరసముగా యుండుట సహజము. అట్టివారు కండనిచ్చు మంచియాహారమును తీసికొనవలెను,

సన్నని కంఠము కలవారు ఊపిరి బాగుగా పీల్చి కంఠము నుబుకునట్లు చేసి గాలిని బహు నెమ్మదిగ విడిచినచో కూడ లాభదాయకము. గాలిని పూరించిన తరువాత 5 సెకనుల కాలము నిలిచియుండనిమ్ము. విడుచునపుడు పెదవులవద్దనున్న దీపముకూడ కదలకుండునంతటి నెమ్మదిగా గాలిని విడువుము. వయసు మీరినను సుందరవదన ముండవచ్చునుగాని ముడుతలులేని మెడ యుండుట దుస్తరము. ఈపరిశ్రమ ముడుతలు లేకుండ జేయుటకు చాల లాభకరము.

## కుచములు

స్త్రీల యందమునకు కుచసౌష్ఠవము చాలవరకు తోడ్పడును. సౌష్ఠవకుచములు కలిగియుండుటకు చాలవరకు శరీరతత్వమే కారణము. శరీరమునకు వేడిచేయు పదార్థములు విశేషించి తినినచో కుచములు నీరసించును. క్రొవ్వుపదార్థములను తినువారి కుచయుగము ఉబుకును. విశేషించి కాయకష్టము చేయుటచే మితిమీరిన పరిశ్రమవలన కుచయుగ మెండిపోవును. ఐహికదృష్టి లేకయున్నను వానికి వృద్ధియుండదు. వయసుకు తగిన పుష్టిలేకయున్నచో వానిపై కాడ్లివరాయిలు మర్దనచేసినచో కండపట్టును. మర్దనవలనకూడ కుచయుగము కండపట్టుట గలదు. కాని యీ పరిశ్రమ వివాహముకానివారికి తగదు. విశేషించి కండ కలిగియున్నచో శరీరము కృశించుటకు తీసికొను శ్రద్ధయే తీసికొనవలెను. విపరీతముగ రూపుమాసి దీర్ఘములైయున్నచో

బజారునందమ్ముడుపోవు ఎట్టి విలువయిన మందులును వాటికి సాయము చేయనేరవు. రూపు చెడును గదాయని శిశువులకు పూర్తిగా పాలిచ్చుట మానజనదు. పాలీయవలెనని రాత్రింబవళ్లు విరామములేక స్తన్యమీయజనదు. తల్లి యేవిధముగ యలవాటుచేయునో దాని కనుగుణముగ శిశువు నడచుకొనును. రెండు సంవత్సరములు దాటిన తర్వాత స్తన్యమీయతగదు.

చనుగవ యందమును కాపాడుటకు లోపలి రవికె (బాడీ) యత్యావసరము. పగలు బాడీని బిగువుగ ధరించినను రాత్రులందు దానిని సడలింపవలెను. లేదా తీసివేయవలెను. దీర్ఘములై రూపుచెడిన చనుగవగల యంగనకు ఏబాడీగాని యుపకరించును. కాని సాధారణయువతులకు బహునేర్పుతో తయారుచేయబడిన బాడీ వలన మాత్రమే లాభము కలుగును. బాడీవలన ప్రయోజనము బిగియగట్టుటయే కాదు. హెచ్చుగా బిగియ గట్టుటచే గాలిసోకక, రక్తప్రసారమున కాటంకముకలిగి యనర్థముకూడ కలుగును. చవుకగ తయారగు బాడీలచే యడ్డముగ బిగియగట్టినచో కుచయుగము తప్పడపోయి యింకనూ రూపుచెడును. భుజముపైనుండు లేసు కుచమును పైకిలాగు త్రాడుగను కుచమునకు క్రిందయుండు గుడ్డ కుచమును పైకెత్తిపెట్టు బోటువలెను ధరించుస్త్రీకి గోచరించవలెను. అట్టి బాడీ యేర్పడునట్లు తగుశ్రద్ధతో కుట్టుకొనవలెను. విలువయిన జాకెట్టు యిచ్చెడి అందముకంటె బాగుగా కుట్టబడిన బాడీ యిచ్చెడు అందము ఎక్కువ. మొదటినుండియు విడువక సరియయిన బాడీని ధరించు యలవాటుగలవారి కుచముల యందము చెడిపోవుటకు వీలులేదు.

## నడుము

ఉవిదకు సన్నని నడుముండుట యందము. నడుము లావుగనున్నదని తోచినచో యీ పరిశ్రమ చేసిన కొంతవరకు లాభించును. ఉదయము స్నానమునకు పూర్వము బాగుగ తెరువబడిన కిటికీముందు నిడివిగ నిలువుము. డంబెల్సు ఉన్నచో చేతులవ్రేళ్లను నిడివిగాచాపి భుజమునకు సమానమయిన ఎత్తువరకు అడ్డముగా ఎత్తియుంచుము. నీ శరీరభారమును కుడికాలిపై యాననిమ్ము. చేతులట్లే యడ్డముగనుంచి శరీరమును కుడివైపునకు మెల్లత్రిప్పి నీ ఎడమపిరుదును చూడ ప్రయత్నింపుము. మరల యథాస్థానమునకు వచ్చి ఎడమకాలిపై భారమాని కుడిపిరుదును చూడబోవుము. ప్రతి త్రిప్పునకును మధ్య దీర్ఘముగ గాలినిపీల్చి మరొక త్రిప్పునకు విడిచివేయుము. ఇట్లు దినమునకు పదినిముషములకాలము చేయుము.

విశేషించి క్రొవ్వుపదార్థములు తినుటచేతను, పరిశ్రమలేకపోవుటచేతను, కొంతమందికి పొట్టపై యుండు చర్మమునకు అడుగున క్రొవ్వు పెరుగును. బాలింతలు సరిగ పథ్యముచేయకపోవుటచే పొత్తికడుపు పెరుగును. అట్టివారీక్రింద చెప్పబడిన పరిశ్రమ విడువక చేసినచో నిక్కువముగ లాభము పొందుదురు. దీని వలన క్రొవ్వు కరుగును. పలుచని పొట్టయు, పొత్తికడుపు నరములకు బలమును, నడుమునకు పటిమయు చేకూరును. భోజనమునకు పూర్వము నేలపై పరువబడిన చాపపై వెల్లకిల పరుండుము. చేతులు చెవులకు తాకునట్లు వెనుకకు చాపుము. ఊపిరి బిగియబట్టుము. ఒకకాలిని నెమ్మదిగా నిడివిగా నిలబడునట్లు వచ్చునట్లు ఎత్తుము. తరువాత నెమ్మదిగా క్రిందికివాల్చుము. ఈకాలు క్రిందికిపోవు సమయమున రెండవకాలిని పైకి రానిమ్ము. ఊపిరి వదలుము. ఇట్లు కొంతసేపయినతరువాత రెండుకాళ్లను జంటగా పైకెత్తుము. వాటిని నిడివిగా నిలబడునట్లు రానిమ్ము. నడుమునెత్తి ఆకాళ్లను వీలయినంతవరకు చేతులవైపుకు రానిమ్ము.

అలవాటయినచో కొలదిదినములకు కాళ్లు చేతులపైకి వచ్చును. అప్పుడు భుజములపై శరీరము నిలచియుండును. చేతివ్రేళ్లకు కాలివ్రేళ్లు తగులును. అప్పుడు నెమ్మదిగా మొదటపరున్న స్థానమునకు కాళ్లు రానిమ్ము. కాళ్లు నట్లే నేలకు తగిలియుండనిమ్ము. చేతులను నడుమును నెమ్మదిగాఎత్తి చేతివ్రేళ్లతో కాలివ్రేళ్లను, కాళ్లు వంగకుండనుండగా పట్టుకొనుటకు ప్రయత్నించుము. కొన్ని దినములకది సాధ్యమగును. ఇట్లు 10 నిమిషములం చేయుము. ఈ పరిశ్రమ వనితలకత్యంత యారోగ్యదాయకము. దీనివలన యింతేని లాభముగలదు.

## చేతులు

చేతులం సన్నబారియుండినను, బలసి మిక్కుటముగ కండపట్టియున్నను పరిశ్రమవలన చాలలాభము కలుగును. మొదను చెప్పబడిన పరిశ్రమ పద్ధతులనే దీనికిని యవలంబించుము. అందు చెప్పబడిన మర్దన చేయనగు తైలములే చేతులకును ఉపయోగించును. మరియు చేతులతో డంబెల్సును పట్టుకొని పిడికిలి భుజమునకు తగులునట్లును, మోచేయి భుజమునకు సమానమయిన ఎత్తున యుండునట్లును ఎత్తి వాటిని దింపినచోకూడ చేతులకు పరిశ్రమకలిగి లావుగనున్నవాటిని సన్నముగను, సన్నముగనున్నవాటిని లావుగను చేయును.

చేతులకు గోళ్లనుండనీయకుము. గోళ్లుండుట యొకయందమని నీవు భావింపకుము. వారమున కొకసారియయిన గోళ్లను తీసివేయుము. తీయుటకుముందు నిమ్మరసము, సబ్బు కలిపిన నీటిలో కొద్ది నిముషములం గోళ్లను నాననిమ్ము. అవి మెత్తగ తెగిపోవును.

## పాదములు

ఎంతమాత్రమును బద్ధకించక పాదములను ప్రతిదినము శుభ్రపఱచవలెను. స్త్రీలు పాదరక్షలను ధరించుటకు సంశయించెడికాలము పోయినది. దానితోపాటు పాశ్చాత్యరీతిని ఎత్తయిన మడమలుగల కాలిజోళ్లను ధరించు విపరీతపు పోకడకూడ ప్రాకుచున్నది. అరంగుళమునకు మించని ఎత్తుగల మడమలుగల ఆకుజోళ్లను ధరించుట మంచిది. పాదమునకు హానిచేయు సన్ననికొనగల షూలను ధరించుటకంటే లేసు షూలను ధరించుట మంచిది.

## తుదిమాట

సౌందర్యపోషణ విషయమై కొంతవరకు ఈపైన తెలుపబడినది. అందు నీకేది యనుగుణమో యా నియమమునే పాటింపుము. ఒక్కదినమున మంచిసబ్బువలనగాని పౌడరువలనగాని సౌందర్యము లభించునని యూహింపకుము. నీవు సౌందర్యముగ నుండవలెననెడుకోర్కె నీయందు ప్రతిదినము యుండనిమ్ము. దానినెట్లు పోషింపవచ్చునో వీలయినంతవరకు యా నియమముల పాటింపుము. పరిశ్రమచేసినచో విసుగుచెందక కొంతకాలముపాటు చేయుము. కొన్ని సంవత్సరములనుండి యేర్పడిన కండ మార్పుచెందుటకు కొన్నివారములయినను కావలయునని గుర్తింపుము. సౌందర్యము ఆరోగ్యముపై చాలవరకు ఆధారపడియుండునని గ్రహించి యారోగ్యరక్షణకై తగుశ్రద్ధ తీసికొనుము. ఇందువలన నీ సౌందర్యము నభివృద్ధిచేసికొంటివేని నీ మనస్సునకు సంతృప్తికలుగుటయేగాక సుందరసుమమురీతి నీ సుందరశరీరము చూపరులకండ్లకు విందుకూడ నొనర్చును.

(సమాప్తి)

—శ్రీ అలంపురం రాజు, బి. ఏ.



# "శిశువు"

నా కవిత్వాని కందని నవ్యకళలు,
హేమలతలయి, పూలు పూయించుచుండె,
ఒక మహాసౌరభంబందు యెదిగి దిశల
బంచుచుండెను శీతల వాయువీచి.

చూడచూడగ వింతసొబగులు గురియుచు
　　　పగడాలు బండు, నా వదనమందు,
ఉండుండి పలికెడి, ఊఁ ఆఁ లలో నేమొ
　　　వేదాంతభావముల్ వెల్లివిరియు,
ఒకనాటి కొకనాడు ఒక నూత్నభాషలో
　　　మాధుర్యమొలికెడి మాటలూరు,
ఇంతింతలై, శ్రీల నెగబోయు కనులలో
　　　జగములనేలు తేజంబు వెలయు,

అనుదినంబును జూచు సర్వాంగములును
లలిత సుస్నిగ్ధమగుచు విలాసమొదవు,
ఆ మహాశిల్పి నిర్మించి అవనికంపు
చిత్రముల మేటిచిత్ర మీ శిశువుగాదె!

ఒక్కపదమేని, పాటేని ఊహసేయ
వలనుపడకుండ శాసించి నిలుపులీల
నన్ను నిర్విణ్ణునిగ జేసినావు, తల్లి!
నీకు దీర్ఘాయురస్తు! సుశ్రీకుమారి!
ఏండ్లు పూండ్లును జాలవు యింపులొలుకు
నీదు ముఖపద్మమునుజూచి మోదమంద,
పనులు పాటలు మరిచి యీ బ్రతుకె నీకు
అంకితము జేసినాను, దివ్యానురక్తి.

—శ్రీ కర్లపాలెం కృష్ణరావు.

# స్వార్థమా? సంస్కారమా?

శ్రీ వల్లూరి గోపాల్ కృష్ణ

'సుబ్బారాయుడుగారూ?'

'ఎవరు?'

'ఉత్తరం ఇదిగోనండి'

బెజవాడనుంచి వచ్చింది. బెజవాడలో మాబంధువులెవరూ లేరు, సుధ తప్ప. సుధ నా సహపాఠి. సహపాఠి ఏమిటి? కాబోయే అర్ధాంగి. సుధ వ్రాస్తే నాపేరులేకుండా మానాన్నగారి పేరుతో ఎందుకు వ్రాస్తుంది? ఇది ఆమె వ్రాసింది కాదు. మరెవరో వ్రాసారని నిర్ధరించుకున్నాను. చింపి చదువుదామనే వుద్దేశ్యం బలవంతమై, మా నాన్నగారి అడ్రసుతోవున్న ఆ వుత్తరాన్ని నాచేత చింపించి చదివించింది. ఉత్తరంచదివి శిలాప్రతిమనైపోయాను.

'వెనుకటి వైరాలు మర్చిపోండి. భార్యాభర్తల్ని విడదియ్యటం భావ్యంకాదు. ఒకరికి ఒకరు కాకుండా చేసినపాపాన్ని మాక్కూడా పంచి ఇవ్వకండి—ముహుర్తానికి తమరు తప్పక అంగీకరిస్తారని తలుస్తున్నాను.'

ఇవీ ఆ వుత్తరంలోని ముఖ్యసంగతులు. నాకు అంతా అర్థంఐంది. చిన్నప్పుడే నాకు పెళ్ళి జరిగిందన్నమాట. అరె! ఎంతమోసం.! అవును నాకు లీలగా స్ఫురిస్తోంది. పల్లకీ—ఆపిల్ల ఏడుపూ—నా అవ్యక్త ఆనందం—ఏదో కట్నంకానుకల విషయాల్లో తగాదావచ్చింది. అప్పణ్ణించీ ఎవరూ వారిమాట తలపెట్టడంలేదు. కాలచక్ర పరిభ్రమణంలో నేనూ ఆ వైవాహికం మర్చిపోయాను.

మా నాన్నగారు రావటంచూసి వుత్తరం దాచేసాను. 'అబ్బాయీ నీకో సంబంధం నిశ్చయం చేసాను. ఈ శలవల్లోనే వివాహం చేసుకుందువుగాని.' నేను సాహసించాను. 'అదేమిటండీ నాకు చిన్నప్పుడే అయిందిగా పెళ్లి?' ఆయన నావంక అదోలాచూస్తూ 'నీ మొహం, చిన్నప్పుడు పెళ్ళేమిటి? ఏమన్నా మతి పెడదారిపడుతోందా?' 'అవును చిన్నప్పుడే పెళ్ళేమిటి?' బొమ్మలపెళ్లిగానీ! కానీ, జరిగిపోయినాక వాళ్లని మోసంచెయ్యటం భావ్యమా? సుధ నా ఎట్టఎదట భావవీధిలో నాట్యంచేస్తోంది నన్నాహ్వానిస్తూ. నేను పరపురుషుణ్ణని ఆమెకింకా తెలియదు కాబోలు. నాకుమాత్రం ఆమెదగ్గరకి వెళ్లటానికి బెదురుగానే వుంది.

'ఊఁ. ఏమిటి? ఈ శలవల్లో?' మా నాన్నగారు నా భావాల్ని చెదరగొట్టారు.

'వీల్లేదండీ. నేను రేపే బయల్దేరి వెళ్లిపోవాలి. పరీక్షలు.'

'శలవలైనాక పరీక్షలేమిటి?'

'ఇప్పుడంతే. రేపు తప్పకుండా నేను వెళ్లాలి. అదే మీతో చెప్పుదాం అనుకుంటున్నాను.' అప్రయత్నంగా ఈ బొంకు, ఎందుకో తెలీకండానే బొంకేసాను. మా నాన్నగారు దీర్ఘంగా ఆలోచించి ఇంట్లోకి వెళ్ళిపోయారు.

నేను తల రెండుచేతుల్తోనూ పట్టుకుని భావవీధిలోకి దిక్కూ మొక్కూ లేకండా ప్రవేశించాను.

'ఎందుకు అన్నానో అన్నాను నాన్నతో. రేపే బయల్దేరి వెళ్ళిపోవాలి.'

'ఎక్కడికి?'

'బెజవాడ.'—'సుధదగ్గరకా?' 'సుధ స్వప్న సుధే. ఆమెదగ్గరకి ఇక నేనెట్లా వెళ్లగలను? మా వెనకటి అత్తవారిల్లూ బెజవాడే కనుక అక్కడికి వెళ్దాం' అనుకున్నాను.

'ఎందుకూ'

'ఎందుకో నాకే తెలీదు. ఈ ఇంట్లో వుండటానికి వీల్లేదు కనుక.'

♦ ♦ ♦ ♦

నేనెక్కిన మెయిలుబండీకన్నా వేగంగా పరుగెడ్తోంది నా మనస్సు. నా హృదయంలో వెయ్యి రైళ్లూ, విమానాలూ, టాంకులూ, అనేకం ఒడుదుడుకుగా, దారీ తెన్నూ, హద్దూ ఆపూ, లేకండా ప్రయాణం చేస్తున్నాయి. వాట్ని దారిలో పెట్టటానికిగానీ, వాటి గమనాన్ని నిరోధించటానికిగానీ నా మనస్సుకి శక్తి లేకపోయింది. అట్లా ఎంతసేపని పరుగులెత్తుతాయి, తప్పదోవల్నిపడి? ఒక్కమాటు అన్నీ ఢీకొట్టుకుని మహాప్రళయాన్ని కలిగించాయి. ఆ ప్రళయానికి తట్టుకోలేకపోయాం, నేనూ, ప్రయాణీకులూ, మైలూ, అన్నీకూడా కలిసి ఒకేమారు బోల్తాకొట్టాం.

♦ ♦ ♦ ♦

రెండురోజుల అనంతరం బెజవాడ ఆస్పత్రిలో వున్నానని తెలుసుకోగలిగాను. నాకు అవయవ లోపం యేమీ జరుగలేదు గానీ, గుండెకిమాత్రం పెద్దదెబ్బ తగిలిందిట. చాలా నీరసంగా వుంది. ఇంతటి నీరసస్థితిలోనూ సుధా, చిన్నప్పటి బొమ్మలపెళ్లి పెళ్లామూ, ఇద్దరూ భావవీధిలో నాట్యంచేస్తూనే వున్నారు, ఈ సగం శరీరం ఎవరాక్రమించుకుంటూరా అనే మీమాంసలో.

డాక్టరుగారు వచ్చారు నా మంచం దగ్గరకి.

'ఎలావుంది సార్?'

'తమ దయవల్ల మళ్లీ ప్రపంచంలో వున్నాననే సంగతి తెలుసుకోగలిగాను. బ్రతగ్గలననే ధైర్యం వుందా?'

'మరేం ఫరవాలేదు. మీదగ్గరవున్న టిక్కట్టు బెజవాడకి అని వుంది. బహుశా యీ వూళ్లో మీకు చుట్టాలు వుండవచ్చు. వారు ఎక్కడ వున్నారో చెబితే.'

సుధ ఇంటిఎడ్రసు చెప్పాను. మెయిలుబండి, బెజవాడ స్టేషనుకి అతి చేరువలోనే పట్టాలు తొలగింది. బండీ అట్టేవడిగా పోనప్పుడు ఈ ప్రమాదం జరిగింది కనుక అట్టే జననష్టం కలుగలేదని తెలిసింది.

నేను కలతనిద్రలో మూలుగుతున్నాను. చల్లగా నా నుదుటికి ఏదో స్పృశించింది. బహుశా, వుడుకు లాంగుడ్డేమో ననుకున్నాను. కాని ఆస్పర్శ కురుల్ని కూడా వెనక్కి సవరిస్తుంటే ఎవర్దో కరస్పర్శ అని కళ్లుతెరిచాను. సుధ! ఆతృతతోనూ ఆశ్చర్యంతోనూ కూడుకొని, నాతప్తహృదయానికి కొంచెం విశ్రాంతి నిచ్చే చల్లని ముఖపద్మం.

'సుధా' చాలా నీరసంగా పిల్చాను.

'ఎట్లావుంది?'

'కులాసాగానే వుందిగానీ నీకోముఖ్య విషయం చెప్పాలి. చాలా పెద్దగాథ.'

'ఇప్పుడు మాట్లాడవద్దు. అలసట కలుగుతుంది.'

'మనస్సులో వుంచుకొని హృదయభారాన్ని వహించేకన్న నీతో చెప్పేస్తే-అలసట చెందితే మాత్రమేం, హృదయ భారం తీరుతుందిగా.'

సుధ నామాటకి ఎదురు చెప్పలేకపోయింది.

'సుధా. నాకు పెళ్ళయింది'

సంధిపట్టుకుందేమోనని కంగారుపడి నర్సుతో డాక్టర్ని పిల్చుకురమ్మని కబురుచేసింది.

'సుధా, నేను పూర్తిజ్ఞానంతో చెబుతున్నాను. నాకు ఏడవఏట పెళ్ళయింది. వారికీ మా నాన్న గారికీ కలిగిన మనస్పర్థలవల్ల రాకపోకలులేక నేను వారిమాట పూర్తిగా మరచిపోయాను. నా హృదయంలో నీకు చోటిచ్చాను. వారిదీ ఈవూరే. మొన్ననే నాకు ఇక్కణ్ణుంచి వుత్తరం వచ్చింది. అందుకనే బయల్దేరి వచ్చాను. విధి ఇలావుంది.'

నా mode of delivery ని బట్టి నేను పూర్తిగా తెలివితోనే ఈ సంగతంతా చెప్పానని సుధ నమ్మింది. ఆమెకీ ఏమీ తోచలేదు. నిశ్చేష్టతగా నా ముఖం వంక చూస్తూ కూర్చుండిపోయింది, రెప్పన్నా వాల్చకుండా. అది నన్ను అమరలోకంలోకి ఆహ్వానిస్తోంది.

డాక్టరు వచ్చి నా నుదుటిమీద చెయ్యివేసి కంగారు పడ్డాడు. సుధకూడా చూచి నిలువునా కంపించిపోయింది.

'వాళ్ళకి కబురుచేసి పిలిపించు - గవర్నరుపేట' పేరూ మొదలైనవి చెప్పాను. ఆమె నౌకర్ను పంపివుండవచ్చు ననుకున్నాను, బయటికిపోయి వచ్చినందువల్ల.

డాక్టరు అన్నాడు 'అధైర్యపడకండి. ఇప్పుడు గుండె చాలా నీరసంగావుంది. ఇంజక్షన్ కూడా పని చెయ్యదు. ఓమాత్ర ఇస్తాను. దానితో ½ అరగంటలో గుణం కనిపిస్తుంది. లేకపోతే అప్పుడు మరోటి వేద్దాం. భగవంతుడి దయవుంటే—'

ఈ మాటలు నాకు చాలా హీన స్వరంతో చెప్తున్నట్లనిపించాయి.

రివ్వుమని పైకి ఎగిరిపోతున్నట్టనిపించింది. సుధ వెక్కి-వెక్కి ఏడుస్తోంది. ఎవరో తెలీకుండా, బ్రతిమాల్తున్నాను. 'ఒక్కమాటు క్రిందికిపోదాం' అని. కానీ నామాట ఎవరూ వినిపించుకునేట్టులేరు. ఊ-పైకి ఎగిరిపోవటమే వారిపని. అంత పైకి పోయినాక సుధ మాటలు వినిపించకపోవటమేకాక మనిషికూడా అదృశ్యం అవుతోంది. చేతగాని ఫొటోగ్రఫీలో ఒకబొమ్మకి వెయ్యిబొమ్మలు పడ్డట్టు సుధలోనుంచి అనేకమంది సుధలు బయల్దేరి నాపై ప్రవహిస్తున్నారు. కానీ, నా గమనం అందుకోలేక కాబోలు మధ్యలోనే అంతర్ధానం అయిపోతున్నారు. ఒక్కరూ నన్ను కలుసుకోలేదు.

అలికిడి వినిపించింది. పూర్వ రంగంలోకి ఎవరో చాలామంది వచ్చారు. వారిని చూట్టానికీ వాళ్ళతో మాట్లాట్టానికీ విమాన చోదకులకి ఇష్టంవుంది కాబోలు, మళ్ళీ క్రిందకు తీసుకువచ్చారు. ప్రతిమలు ఇదివరకన్నా కొంచెం స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆలస్యం చెయ్యకుండా మూడేముక్కలు చెప్పేసి త్వరగా తెమల్చమని తొందరపెడ్తున్నారు.

'నా అవసానం ఇది. చిన్నప్పుడు మీ అమ్మాయిని పెళ్ళిచేసుకున్నానన్న సంగతి మొన్న మీరు వ్రాసిన వుత్తరంవల్ల తెలిసింది. అప్పుడు జరిగింది పెళ్ళికాదని నా వుద్దేశ్యం. కనుక మీ అమ్మాయికి మంచి వరుడిని ఇచ్చి పెళ్ళిచేయండి!'

ఆయనేదో చెప్పబోయాడు. ఇంతలో ఎవరో మరొక యువకుడు రంగంలో ప్రవేశించాడు. అక్కడివారి భావాల్లో ఆ యువకుడి ఆగమనం కొంచెం మార్పుతెచ్చింది. ఆ యువకుడు కూడా వీరికి తెలీకండానే అక్కడికి ప్రవేశపెట్టబడ్డాడు కాబోలు. వీర్ని చూచి వెనక్కిపోబోయాడు. సుధేకాబోలు 'ఫరవాలేదు రండి' అంది. ఆయన వెళ్ళిపోవటానికి అవకాశం లేకపోయింది. రాధ (చిన్నప్పటి పెళ్ళిపెళ్ళాం) తలవంచుకుంది ఆ యువకుడ్నిచూసి. నాకు ఇది గ్రహించేశక్తి కూడా ఎవరో ఇచ్చారు అప్పుడే. సంగతి తెలిసింది. అతడ్ని ఆమెని దగ్గరకి పిల్చాను. ఇద్దరిచేతులూ నాచేతుల్లోకి తీసుకున్నాను. మామగారి చేతులు అత్తగారి చేతులూకూడా కలిపి.

'ఇది శాశ్వతం చెయ్యండి. ఇదే నాకడసారి కోరిక. నామూలంగా ఒకప్రాణి నిర్భాగ్యం అవటం నా ఆత్మకి సంతృప్తి ఇవ్వదు.' కళ్లు మూసాను. చేతులు పట్టుదప్పాయి. రంయిమని విమానం ఎగిరిపోయింది తారాజువ్వలా. నామీద ఎవరో పడ్డట్టనిపించింది కాని నాకు ఆస్పర్శ తెలీలేదు. కొంతసేపటికి, ఊ, ఎగిరిపోవటమే పైకి.

సుధ తన అమృతభరితమైన ముఖపద్మంలోంచి నామీద జీవసుధ జల్లింది. బహుశా ఆ విమానంలోంచి పారాచూట్ సహాయంతో అమాంతం దూకివుంటాను. అందుకనే నా గుండెలమీద పడుకుని నాముఖాన్ని రెండు చేతుల్తోనూ పట్టుకుని తదేకధ్యానంతో నా ముఖంవంక చూస్తున్న సుధామూర్తి మళ్లీ నాకు కనుపించటం.

నా కనురెప్పలు తొలగిపోయాయి. 'నీ అర్ధాంగిని చూడు, ఎంత ఆత్రుతగావుందో! ఆమెని వదలి నువ్వు ఒక్కడివీ పోతావా? ఎంత అమర ఆహ్వానం అయితేమాత్రం!' అని హెచ్చరించాయి. 'తలత్రిప్పి నీ చుట్టుచూడు, ఎంతమంది కనిపెట్టుకుని వున్నారో! వారంతా నీ అర్ధాంగి పడే ఆవేదనలో ఎన్నోవంతైనా పడుతున్నారా?' అన్నాయి.

అంతా కలకలారవంతో నిండిపోయింది. డాక్టరు నామీద చెయ్యివేసి సంతోషంగా కేకవేసాడు. 'బలే అదృష్టవంతులండీ. ఆనాడు సావిత్రీదేవి భర్తని బ్రతికించుకుందట. అది మనం వింటమేగాని చూళ్ళేదు. ఈవాళ ఈమె' ఇక మాట్లాడలేక పోయాడు.

సుధమనస్సు ఆనందతరంగ డోలికల్లో ఊగులాడిపోయింది. ఆమె నామీదనుంచి ప్రక్కగా కూర్చుంది.

సుధకీ నాకూ జరిగిన వివాహంతో బాటే రాధాకృష్ణుల వివాహంకూడా జరిగింది. (నాచిన్నప్పు పెళ్లామూ, ఆమె ప్రియుడూ అన్నమాట.)

మానాన్నగారు ముందు భీష్మించుక్కూర్చున్నా (నామొహం చూడనని) సుధ నాన్నగారికి చాల ఆస్తివుందనీ, కొడుకుల్లేరనీ తెలుసుకుని అదంతా మనకే వస్తుంది కదా అనే సంతృప్తితో చివరకి వివాహ సమయానికి చేరుకున్నారు. ఇంతకీ వివాహం సలక్షణంగా జరిగిపోయింది.

మా ముఖ్యఅతిథి డాక్టరుగారు. వారికి నమస్కరించాం దంపతులం. 'Very dramatic Mr. Murty' అన్నారు అతిసంతోషంగా. మా గోపాలం 'very lucky fellow—Two birds at one shot అంటే ఇ అసలు. సంస్కారంతో బాటు స్వార్థంకూడా నెరవేరింది' అన్నాడు. మానాన్నగారు వివాహవైభవాని వారి ఆస్తికీ సంతృప్తిపడిరి.

'ఆ భగవంతుని దయ' అన్నారు. మా మామగారు తనకోమార్తె చదువుకున్నందుకు తగిన ఆదర వివాహం చేసుకుందని సంతృప్తిచెందారు.

---

# జగదుద్యానము

శ్రీపాద లక్ష్మీనారాయణమూ

మొక్కలను నాటి తగునీరు పోసి పెంచి
వివిధ జాతి పుష్పములకై వేచియుండ
కొన్ని మొక్కలు పుష్పించకుండ తలగు
కొన్ని యొసగును రంగు రంగుల విరులను.

అందులో కొన్ని పూలభాగ్యంబదేమొ
నిండు భక్తుల పూజా కరండకముల
జేరి దేవాలయద్వార సీమ దాటి
పడయు నీశ్వర సాన్నిధ్య వైభవంబు.

ఇంక మరికొన్ని పూలు రాకేందు ముఖుల
శిరసుల నలంకరించి తద్వరుల హృదయ
ధనముల హరించి ప్రణయైక ధామములయి
సౌఖ్య రసవార్ధిఁ దేలించు సతులఁ బతుల.

కొన్ని పూలెట్టి త్యాగంపు గుణము గలవొ
భృంగ పంక్తికిఁ దేనెలఁబెట్టి తనువు
పాంథలోకమునకు మంచి పరిమళంబు
అవిరళంబుగ వెదజల్లి అలరఁజేయు.

కాని మరికొన్నిపూల యోగంబదేమొ
ఎవ్విధంబుననైన తరించలేక
భూమిపై నెట్లుపుట్టెనో, భూమిపైన
తిరిగి యారీతి రాలి గతించు నకట.

ఇట్టులే ధారుణీస్థలిఁ బుట్టు నరులు
కొందరీశ్వర సాన్నిధ్య మందగలరు
కొందరున్నత పదవుల పొందగలరు
కొందరు నిరర్థకంబుగా నుందుచుంద్రు.

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

## కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )

## స్థానములు - లేక - దిబ్బలు

### గురు స్థానము

ఇది చూపుడు వ్రేలి అడుగుభాగము. ఇది మత విషయమునందు నమ్మిక, యోగ్యత; అత్యాశ; జనప్రియత్వము - వీటిని సూచించును.

ఈ దిబ్బ బాగా ఉబికి బొద్దుగా పెద్దదిగానున్న అహంభావము, గర్వము, మనోవికాసం, వాక చక్యము, శక్తి, విద్య—వీటిని సూచించును. ఈ గురుదిబ్బ చిన్నదిగా శుష్కించియున్న నాస్తికత్వము, స్వకార్య ధురంధరత్వము, ఆత్మగౌరవములేమి, సోమరితనము-వీటిని సూచించును.

### శని స్థానము

ఇది మధ్యవ్రేలి అడుగునున్న భాగము. ఇది జాగ్రత్త, మంచి తెలివి, అనృతము, దుఃఖము, దాస్యము, అనాచారమును తెలుపును.

ఈ దిబ్బ పెద్దదిగానున్న ఏకాంతవాస ప్రియత్వము, వ్యాపలము, పాశ్చాత్యవిద్య, ధనము-వీటిని తెలుపును. ఈ దిబ్బ చిన్నదైయుండిన మిక్కిలి విచారము, సాధారణమైన జీవనము, మనోవ్యాధి - వీటిని సూచించును.

### రవి స్థానము

ఇది మూడవవ్రేలి యడుగుభాగము. లలితకళలు, సూక్ష్మబుద్ధి, మేలుగోరుట, విద్వత్తు, మనోనిశ్చయము-వీటిని సూచించును. ఈ రవిదిబ్బ పెద్దదిగానుండిన మితిమీరిన ద్రవ్యాశ, ఆత్మస్తుతి, అసూయ, పరిహాసనము, ఉద్యోగము, ఔన్నత్యము, గొప్ప విద్య-వీటిని సూచించును.

ఈ దిబ్బ చిన్నదిగా నుండిన సామాన్య గుణములు, స్థిరత్వము, విద్య, జయం మొదలగు వాటిని సూచించును.

### బుధ స్థానము

ఇది చిటికెనవ్రేలి యడుగుభాగము. ఇది సూక్ష్మబుద్ధి, వాక్చాతుర్యము, హాస్యగుణము, క్రొత్త విషయములను కనిపెట్టుట, తీవ్ర ప్రయత్నము, విచక్షణ - వీటిని సూచించును. ఇది బాగాఉబికి పెద్దదిగా నుండిన అసూయ, ద్రవ్యాశ, వాణిజ్యము, శాస్త్రజ్ఞానము, యుక్తి, గ్రహణశక్తి-వీటిని దెల్పును.

ఈ దిబ్బ చిన్నదిగానుండిన బుద్ధి మాంద్యము, ఉత్సాహహీనత, సామాన్యకృషి, ధైర్యములేమి వీటిని సూచించును.

### అంగారక స్థానము

చేతియందు రెండు అంగారక దిబ్బలున్నవి. 1. గురుదిబ్బకు క్రింది భాగమున నుండునది. ఇది క్రింది కుజదిబ్బ 2. బుధ దిబ్బకు క్రింది భాగమున నుండునది. ఇది పై కుజదిబ్బ.

# స్వర్గీయ శ్రీ చేరాల భారతీదేవి

ఈ మహాసాధ్వి గౌరవనీయ మాధ్వకుటుంబమున గుంటూరు కొత్తపేటలో 1911 సం॥ మార్చి నెలలో జన్మించినది. 1921 సంవత్సరమున వివాహమైనది. భార్యా భర్తలకు అయిదు సంవత్సరములు మాత్రమే వ్యత్యాసము. 1925 సం॥ కాపురమునకు వచ్చినది. ఈమె దినచర్య బహు చిత్రపద్ధతిగలది. గడియారమువలె మార్పులేక సక్రమమైనది. గృహకృత్యములయందు యేమాత్రమును నజాగ్రత్త నెరుగదు. ఆదాయవ్యయ పరిశీల. స్వార్థమెరుంగక త్రికరణశుద్ధిగా భర్తను దైవముగా భజించిన ముగ్ధ. ప్రతి శనివారము నొక్కప్రొద్దు భుజింపుతోడను, ప్రతి యేకాదశి ఉపవాసవ్రతముతోను దైవప్రీతికొరకు గడపిన పవిత్ర. కన్నడము, మరాటి చక్కగా మాట్లాడనేర్చెను. ఫిడేలుపైని బహుమాధుర్యమున త్యాగరాజకృతులు, పురందరదాస కీర్తనలు పాడనేర్చిన దివ్యవాణి. భర్తతోపాటు 1930 సంవత్సరమునుండి రాట్నముపై చక్కగా నూలుదీసి వర్షమునకు మొన్నటి దాకను మూడు చీరలు నేయించి, ధరించుచు, విదేశవస్తువుల సింగార మెరిగియు తనదేశవస్తువులనే బహు ప్రీతితో వాడుకొన్న కాంగ్రెసు సభ్యురాలు. పండిత మాళవ్యా గారి రాజ్యాంగ సాంప్రదాయాను సారముగా నడచు తన ప్రియ భర్తకు నీడ. ఏనాడును, హిందువు కానివానియొద్ద పువ్వులుగాని, కాయలుగాని కొనియెరుగదు. బండియు, దర్జీయు హిందువులై యుండవలయును. ఆరోగ్యశాస్త్రము, యే తిండిలో యే విటామినులు యెంతో, యేది ఎంతకాలము అరుగునో, వారమునకు యేతిండి యెంత మానవ శరీరారోగ్యమును కాపాడునో, మొదలైన విషయములు సమగ్రముగా తా చదివి, భర్తవల్ల గ్రహించి, పదకొండు సంవత్సరములు పూర్తిగా ఆ నియమముల ననుసరించి బిడ్డలను బాగుగా పెంచిన యుత్తమపవిత్ర. కుట్టు, అల్లిక, మొదలైన శృంగారపు చేతిపనుల యందు దిట్ట. ప్రతిదినమును భగవద్గీత, భాగవతము, రామాయణము చదివితీరెడిది. 1932 నుండి నేటిదనుకను గృహలక్ష్మి, భారతి పత్రికలను ఆమూలాగ్రముగా చదివెడిది. ఇతరుల యిండ్లత్రోవ లేనాడును యెరుగదు. దేశమున, ప్రపంచకమున జరుగు దినదినపు మార్పులను బాగుగా గ్రహించి, నవనాగరికత నెరిగియు, పూర్వ హైందవమత ధర్మవిరుద్ధముకాని త్రోవనే నడచిన ధన్యశీల. పుట్టింటిపై భ్రమలేని యమాయిక. హిందూసభ సభ్యురాలు. భర్తను వారి తడిపాదములనైనను తుడుచుకో నిచ్చి యెరుగదు. కల్లకపటమెరుగని యబల. పలురకముల పూలచెట్ల పెంచుటయందు యుత్సాహం. తన దివ్య మందిరము, తన మనశ్శరీరములవలెనే శుద్ధిగా నుంచనేర్చెను. దానధర్మములు నేర్చిన భూతదయాపారీణ. మమ్ము నిరువుర కుమార్తెలను, ముప్వురు కుమారులను గాంచి, తన యీ కొద్ది యీడునకే తొమ్మిది కాన్పుల వలన, తుదిని కనలేక తానెచ్చో జనించెనో ఆ కుగ్లేరు ఆస్పత్రిలోనే 10-4-1941 వుదయమున శస్త్రచికిత్సచే తన అయిదుగురి బిడ్డలను, ప్రాణమునకు ప్రాణమైన భర్తను, తలిదండ్రులను, యితర బంధుహితలోకమును వీడి శాశ్వత శాంతిలోకము నొందెను. ఈ పరమపతివ్రత ఆత్మకు సర్వేశ్వరుడు శాంతి ప్రసాదించుగాక!



—చేరాల మాధవీ కుమారి.

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● భాద్రపదమాసము ●

### అశ్విని
స్వల్పాధికారము; జ్ఞానవిచారణ; చోరభయం

### భరణి
వర్తకమూలమున ధనలాభం; ఇతర కుటుంబరక్షణ; దుఃఖము

### కృత్తిక
సాహసకార్యము; అపనింద; భ్రాతృపీడ

### రోహిణి
మణుల వర్తకలాభం; వివాదం; చాంచల్యం

### మృగశిర
రాజదర్శనం; నిష్ఠురోక్తులు; గృహలాభం

### ఆర్ద్ర
మాతృరుగ్మత; ఇష్టార్థసిద్ధి; వ్యయం

### పునర్వసు
వాణిజ్యభంగం; బంధుసన్మానం; విద్యాభివృద్ధి

### పుష్యమి
నైచ్యము; మనస్తాపము; వ్యర్థకృషి

### ఆశ్లేష
గృహకలతలు; కార్యవిఘ్నము; ప్రయాణం

### మఖ
విషభీతి; శత్రువివాదం; ఆదాయహాని

### పుబ్బ
కడుపునొప్పి; కష్టముమీద లాభం; స్థానభ్రంశం

### ఉత్తర
శస్త్రచికిత్స; వ్యాజ్యం; బంధనం

### హస్త
అలసట - సద్గోష్ఠి - సంచారములో శుభం

### చిత్త
దారిద్ర్యం; యుద్ధభయం; విచారం

### స్వాతి
ఆరోగ్యం; ప్రయాణములో ధనలాభం; సౌఖ్యము

### విశాఖ
పరిమళవస్తులాభం - గోలాభం; కీర్తి

### అనూరాధ
రాజభయం; జ్వరం; దుర్వార్తాశ్రవణం

### జ్యేష్ఠ
ధననష్టము; దేశాటనం; గౌరవహాని

### మూల
దుస్సహవాసం; వాతరోగం; పరదూషణం

### పూర్వాషాఢ
స్త్రీమూలమున ద్రవ్యనష్టం; అకీర్తి; ఋణబాధ

### ఉత్తరాషాఢ
రాజకోపం; ఆయుధభయం; మిత్రలాభం

### శ్రవణం
వ్యాకులం; నిర్వ్యాపారం; విద్యాగోష్ఠి

### ధనిష్ఠ
నూత్న వ్యాపారం; శుభకార్యం; స్వాతంత్ర్యం

### శతభిషం
పిత్తజ్వరం; అలసత్వం; వాహననష్టం

### పూర్వాభాద్ర
వ్యాపారవృద్ధి; మనోరథసిద్ధి; సంగీతగోష్ఠి

### ఉత్తరాభాద్ర
కారాగారవీక్షణం; దేశాటనం; స్వజనదూషణం

### రేవతి
స్వగ్రామ గమనం; ధాన్యలాభం; పెద్దలసేవ




చిన్ని ఉత్తరాలు

# రాజపుత్రస్థానం

సర్వమంగళా,

మనం ఎవర్నైనా ఒకకథ చెప్పమని అడిగితే వాళ్లు "అనగనగా ఓరాజు" అని మొదలెడతారు, సాధారణంగా. ఇలా మొదలెట్టడానికి కారణం మన కథలు చాలామట్టుకి, రాజులూ, రాజకుమారులూ, రాజకుమార్తెలూ వీళ్లనిగురించినవే. ఈ రాజకుమాళ్లంతా మంచి బలం, పౌరుషం ఉన్నవాళ్లు. ఈ రాజకుమార్తెలు, చాలా సౌందర్యం, సాహసం కలవాళ్లు. అంచేతనే వీళ్లమీద ఇన్ని కథలున్నాయి.

ఈ రాజపుత్రులు ఉండే భాగాన్నే "రాజపుత్రస్థానం" అంటారు. ఈ భాగం మనదేశంలో సింధునదికి తూర్పుగా ఉంది. ఇక్కడ ఆట్టేవర్షాలు కురియవు. అంచేత ఇక్కడ వరి అలాంటిపంటలు పండవు.

ఇదివరకు నీకు మనదేశంలో గవర్నర్లు పాలించే రాష్ట్రాలుగాక ఎన్నో స్వతంత్రరాజ్యాలు ఉన్నాయని చెప్పేను. అలాంటి స్వతంత్రరాజ్యాలు రాజపుత్రస్థానంలో చాలా ఉన్నాయి. ఈ ప్రదేశాలలో పూర్వం రాజులు కట్టిన పెద్ద పెద్ద కోటలు ఇప్పటికీ ఉన్నాయి. ఈ రాజులు గతించి చాలా కాలమైనా వీళ్లకీర్తి శాశ్వతంగా నిలిచిపోయింది. అందుకు కారణం ఈ రాజులంతా దేశంకోసం శత్రువులతో పోరాడి వీర స్వర్గం పొందేరు. 'వీర స్వర్గం పొందడం' అంటే ఏమిటో తెలుసా? ధైర్యంతో యుద్ధానికెళ్లి, అపజయం వస్తుందన్నప్పుడు కూడా పారిపోయిరాకుండా యుద్ధభూమిలో నిలబడి యుద్ధం చేస్తూ ప్రాణాలు వదిలిపెట్టడం. అలా ప్రాణాలు వదలిపెట్టిన వీరులకు స్వర్గం వస్తుందని అప్పటివాళ్లు నమ్మేరు. యుద్ధంలోంచి భయపడి ఎవరూ ఇంటికి పారివచ్చేవారుకాదు. అలా ఎవడైనా పారిపోయివస్తే, వాణ్ణి ఆడవాళ్లు కూడా ఎగతాళి చేసేవారు. ఏ పురుషుడైనా యుద్ధానికి పోవడానికి కాస్త వెనుదీస్తున్నాడని తెలుస్తే, అతనిభార్య, తల్లి వీళ్లంతా అతనికి పౌరుషంవచ్చే మాటలు పలికి యుద్ధానికి పంపేవారు. అందుకే రాజపుత్ర కాంతలకి వీరపత్నులనీ, వీర మాతలనీ పేరొచ్చింది. రాజపుత్రకాంతలు పురుషుల్ని యుద్ధభూమికి పంపడమే కాకుండా అవసరమైనప్పుడల్లా వాళ్లే యుద్ధానికెళ్లేవారు. గోండురాష్ట్రాన్ని పాలించిన 'దుర్గావతి' అనే రాణి అక్బరు

పాదుషాలాంటి గొప్పవాడి సైన్యాన్ని ఎదుర్కొని ధైర్యంతో పోరాడి రణభూమిలో ప్రాణాలు త్యజించింది. అలాంటి వీరవనితయే ఝాన్సీ లక్ష్మీబాయి అనే ఆమె. ఝాన్సీ ప్రస్తుతం పరిపాలించే తెల్లవాళ్లతో యుద్ధం చేసింది. ఆవిడ సంతానంలేక ఒక పిల్లవాణ్ణి పెంచుకుంటానంటే ఇంగ్లీషువాళ్లు పెంచుకోడానికి వీల్లేదన్నారు. అందుచేత ఆమె తిరుగుబాటు చెయ్యవలసొచ్చింది. ఆమె పట్టుదలతో ఇంగ్లీషువాళ్ళ సైన్యాన్ని ఎదుర్కొని వీర స్వర్గాన్ని పొందింది.

అమ్మమ్మా, రాజపుత్రకాంతల్ని గురించి చెప్పుకుంటూన్నప్పుడు మనకి పద్మిని జ్ఞాపకంవస్తుంది. పద్మిని చిత్తూరు రాణా భార్య. చాలా అందమైనది. ఈమె అందాన్ని చూసి మోహించి, అల్లాయుద్దీను అనే సుల్తాను చిత్తూరు మీదకి దండెత్తేడు. పద్మిని పురుషుల్నందర్నీ యుద్ధానికి పంపించింది. సుల్తానే యుద్ధంలో నెగ్గుతాడని తెలుసు. ఆతడు అంతఃపురంలో ప్రవేసించి తన్ను చెఱబడతాడని తెలుసు. అందుచేత ఆమె తనతోటి ఆడవాళ్లతో చితులు పేర్పించుకుని వాటిలో ప్రవేశించి మానాన్ని కాపాడుకుంది.

'రాజస్థాన కథావళి' అని ఓ పుస్తకం ఉంది. ఇలాంటి వీరచరిత్రలన్నీ అందులో ఉన్నాయి. ఆ పుస్తకం నీకు పంపుతా. చదువుకుందువుగాని.

చెన్నపట్టణం,
**1.9.41.**

పిన్ని

---

## అశ్రుతర్పణము

ఓరవీంద్రుడా! యెటకేగితో యటంచుఁ
వెతనుగాంచుచునున్న మా వెఱ్ఱితల్లి
దైన్యమును జూడ గుండెలు తఱుగుకొనును
భరతజనయిత్రి యెంత నిర్భాగ్యురాలు!

తనదు కవితావిభూతితో ఘనతగాంచి
భరత దేశీయ ప్రతిభకు వన్నెదెచ్చు
మనరవీంద్రుఁడే యీనాఁడు మాయమయ్యె
భరతజనయిత్రి యెంత నిర్భాగ్యురాలు!

ఆ మరణవార్త వినఁగనె హా! యటంచు
వగచి కన్నీరు వీడనివారు లేరు.
కలత నందినది ప్రపంచకమ్మునేడు
భరతజనయిత్రి యెంత నిర్భాగ్యురాలు!

అతని గీతాంజలిని విని యువనిమెల్ల
తన్మయంబందె నానందతరఁగలఁబడి
అయ్యొ! విశ్వకవీంద్రుఁడే యస్తమించె!
భరతజనయిత్రి యెంత నిర్భాగ్యురాలు!

—అయ్యగారి విశ్వేశ్వరరావు.

# స్త్రీల వేసంగిపాఠశాల, బాపట్ల

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

విద్య, ఆరోగ్యము, వైద్యము, రాజకీయము, సాంఘికము, సహకారము, గ్రామ పునర్నిర్మాణము ఆదిగాగల పెక్కు విషయములలోగాని, లేక యేదేనొక ప్రత్యేక విషయములోగాని యువజనులలో జ్ఞానాభివృద్ధి కలిగించు నిమిత్తము వేసంగి పాఠశాలలను స్థాపించుట కొన్ని సంవత్సరములుగా మన ఆంధ్ర దేశములో జరుగుచున్నది. కాని యివన్నియు పురుషుల పాఠశాలలే. ఈ పాఠశాలలయందు కొందఱు స్త్రీలుగూడ శిక్షణము బడసి యుండవచ్చును. కాని స్త్రీలకు ప్రత్యేకముగా వేసంగి పాఠశాల నింతవఱ కెవరును స్థాపించలేదు. పురుషుల వేసంగి పాఠశాలలలో జరుగుచున్న కార్యక్రమము పత్రికలలో చదువుచున్నప్పుడు స్త్రీలకుగూడ నిట్టి పాఠశాలలను స్థాపించుచుండిన నుపయుక్తముగా నుండునని తలచుచుంటిని. స్త్రీ సమాజములను స్త్రీ విద్యా సంస్థలను నడుపుచున్న కొందఱు నారీమణులతో ప్రస్తావనచేసియుంటిని. కాని యెవరును సుముఖమైన ప్రత్యుత్తరమీయలేదు.

బాపట్ల సేవాసమితివారు ఈ సంవత్సరము వేసంగిలో పురుషులకు వేసంగి పాఠశాలను నడుపుటకు నిశ్చయించుకొని స్త్రీలకు గూడ నొక ప్రత్యేక తరగతి పెట్టవలెనని తలంపుకలిగి దీని నిర్వహణభారమును నన్ను వహింపవలసినదని కోరిరి. స్త్రీల కిట్టి పాఠశాలలుండవలెనని నే నిదివఱకే అభిలాషపడుచున్నందు వలన వారు కోరినంతనే అంగీకరించితిని.

బాపట్లయందలి స్త్రీహితైషిణీమండలిలోని స్త్రీల వేసంగి పాఠశాలయే పదునేడవ తేదీ మొదలు ఒక నెలదినములపాటు అవిచ్ఛిన్నంగా జరిగినది. పురస్త్రీలు చాలమంది ఉత్సాహముతో పాఠశాలలో జేరినారు. విద్య, వైద్యము, ఆరోగ్యము, గ్రామ పునర్నిర్మాణము, గృహనిర్వాహకత్వము, గృహపరిశ్రమలు, ప్రపంచజ్ఞానము, యుద్ధ పరిస్థితులు, స్త్రీల ధర్మములు, స్త్రీల బాధ్యతలు, స్త్రీల సమస్యలు, అంతర్జాతీయ న్యాయశాస్త్రము, ఆత్మజ్ఞానము, కావ్యపరిశీలనము, అస్పృశ్యతా సమస్య, ఆదిగాగల విషయములపై దాదాపు పదునార్గురు విద్యాధికులు ఆయా విషయములందు ప్రావీణ్యత అనుభవము కలవారు, ఉపన్యసించినారు. వీరిలో నలుగురు స్త్రీలుగూడ గలరని తెలుపుటకు సంతసమగుచున్నది. కొందఱు పొరుగూరులనుండి ఆహ్వానింపబడిరి. కొందరు పురప్రముఖులే. ఒకరు అయిదు ఉపన్యాసములను ఒకరు నాల్గుపన్యాసములను, ముగ్గురు రెండేసి ఉపన్యాసములను యిచ్చిరి. వీనితోబాటు ఉదయవేళ బాలికలకు సూర్య నమస్కారములును హిందీ పాఠములును నేర్పబడినవి. సాయంత్రము నాల్గుగంటలనుండి ఆరువఱకు ప్రతినిత్యము స్త్రీలకు ఉపన్యాసము లీయబడినవి. ఇంతలో వేసంగి పాఠశాలల నిషేధిస్తూ దొరతనంవారు గావించిన ఉత్తరువు వలన పాఠశాల ఆగిపోయి, యిందు రాజకీయముల ప్రసక్తిలేదని గవర్నమెంటువారు పరిశీలించిన మీదట పునరుద్ధరింపబడి కొంత పనిచేసి గత జూలై 27 తేదితో సమాప్తము చేయబడినది.

నడుమ గల్గిన అంతరాయమువలన అనుకొనిన ప్రకారము ప్రత్తి విడదీయుట, ఏకులు చేయుట నూలువడకుట, మట్టులు తయారుచేయుట, మట్టునుండి బిస్కట్లు వగైరాలు చేయుట, సబ్బులు తలనూనెలు తయారుచేయుట మొదలగు ప్రత్యక్ష ప్రదర్శనములును, రోగుల ఉపచర్య, ప్రమాదములకు ప్రారంభచికిత్స,

శిశుపోషణ, సహకార సంఘములు, ఆరోగ్యశాస్త్రము, అర్థశాస్త్రము మున్నగు వానిపై నిప్పింపదలంచిన ఉపన్యాసములును జరుగకపోయినను పూర్వానుభవ మేమాత్రమునులేక నూతనముగా అవ్యవధిగా తలపెట్టబడి ప్రభుత్వ నిషేధాది అంతరాయములచే నడుపబడిన పాఠశాలలో నీపాటి కార్యక్రమమైనను సక్రమముగా జరుప గలిగినందుకు సంతోషింపవచ్చును. తమ సేవాసమితి పక్షమున స్త్రీల తరగతిని నెలకొల్పుటయేగాక వీని నిర్వహణమున అత్యంతశ్రమపడిన సేవాసమితి అధ్యక్షులును కార్యదర్శులునునగు మ-రా-శ్రీ వేదాంతం వాసుదేవరావుగారును, పంగులూరి మాణిక్యారావుగారును, లక్కరాజు భార్గవీ మనోహరరావుగారును నెంతయు వంద్యులు.

ప్రభుత్వమువారి అనుమతిని ముందుగానే పొంది ఆరువారములకు సరిపడిన నికరమైన బోధనా ప్రణాళికను నేర్పరచుకొని ఒక్కొక్కవక్తి ఒక్కొక్క విషయముపై మూడునాల్గుపన్యాసములకు తక్కువ లేకుండా నొసంగి ప్రతి ఉపన్యాస సారాంశములను విద్యార్థినులు జాగ్రత్తగా వ్రాసిపెట్టుకొని వానిపై పరీక్షాపత్రముల నిచ్చు నేర్పాటులు చేయబడినచో వేసంగి పాఠశాల స్త్రీలకు అత్యంత ప్రయోజనము కలిగించగలదు. వీనితోబాటు వారమున కొకవినోద కార్యక్రమముకూడ నుండిన పాఠశాల మతింత ఆకర్షణీయము కాగలదు. పొరుగూరినుండి ఉపన్యాసకులను రప్పించుట, మ్యాజిక్ లాంతరులు, భూగోళపటములు వగైరాలు సంపాదించుట, కొంచెము కష్టముగాన పల్లెటూరులలో నిట్టి పాఠశాలలను నిర్వహించుట వ్యయ ప్రయాస సాధ్యము కావచ్చునుగాని బస్తీలలో వీనిని సులభముగా నిర్వహింపవచ్చును. ఎవరి భోజనఖర్చులను వారు భరించుచో పొరుగూరివారుగూడ పాఠశాలలో చదువుకొను నేర్పాటులు చేయవచ్చును. సాధ్యమైనంత తక్కువకాలములో నెక్కువ విజ్ఞానమును, ఉపన్యాసాది సులభమార్గముల ద్వారా బోధించుటయే వేసంగి పాఠశాలల ముఖ్యోద్దేశము కాన పాఠశాలలలో సంవత్సరములకొలది చదువుట కవకాశములేని విజ్ఞాన పిపాసగల స్త్రీ లీ పాఠశాలలో చేరినచో మిక్కిలి ప్రయోజనము బడయగలరు. ఆంధ్రదేశమునందలి స్త్రీ సమాజములవారును, స్త్రీ విద్యాసంస్థలను నడుపువారును, ఏటేట యిట్టి స్త్రీ వేసంగి పాఠశాలలను నడుపుటకు పూనుకొని స్త్రీల విద్యా విజ్ఞానముల నభివృద్ధిజేయ యత్నింతురను నాసతో నీ విషయమును గృహలక్ష్మియందు వెల్లడించితిని. నా విశ్వాసము వమ్ముగాదని నమ్ముచున్నాను.






## స్త్రీలు - గృహపరిశ్రమలు

చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖవారు ఆగస్టు 3 వ తేదీని ఒక పారిశ్రామిక విభాగమునకు ప్రారంభోత్సవముచేసి అందరి ప్రశంసకు పాత్రులయిరి. ఈ చేతిపనులశాఖా నిర్వహణమునకు అయ్యే వ్యయమంతటిని భరించుటకు అమితోదార విరాళమును ప్రకటించిన శ్రీ రాణీ రాజ్యలక్ష్మి మురళీ కృష్ణారావుగారు అభివందనీయులు. ఈ గొప్ప ప్రారంభోత్సవసభకు అధ్యక్షతవహించి హృదయపూర్వకముగ ఆశీర్వచనముచేసి తొలిసహాయముగ 200 రూపాయిల దానమొసంగిన జయపురాధీశులగు శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు మిక్కిలి స్తవనీయులు. జాతీయసంపదకు, ఆర్థికస్వాతంత్ర్యమునకు ఎంతయు తోడ్పడు గృహపరిశ్రమలయెడల చేతిపనులయెడల ప్రధానకర్తవ్యము స్త్రీలదే. పురుషులమీదనే స్త్రీలు ఆధారపడి యుండరాదని, ఆర్థికస్వాతంత్ర్యము సమానత్వము కావలయునని, స్వయంపోషకత్వమే ఉత్తమాశయమని, జాతీయ పునరుజ్జీవనమునకు స్త్రీలే దారితీయవలెనని, గృహమునందే నిర్మాణశీల కార్యముల ప్రారంభము నభివృద్ధి కావలెనని ఆశించువారెల్లరు నిట్టి ప్రయోజనకరమగు సంస్థలయెడల తమ శుభాకాంక్షలను వెల్లడి చేసి అవసరమగు తోడ్పాటు నిచ్చెదరు.

శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షస్థాన బల ప్రోత్సాహములచేతను, శ్రీమతి దుర్గాబాయి నిరంతరకృషిఫలితముగను ఏర్పడి నడచుచున్న చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖవంటి సంస్థలు వట్టి క్లబ్బుల వలె కాక, వినోదమునకు ఆమోదప్రమోదములకొఱకే కాక, స్త్రీల విద్యాభివృద్ధికొఱకు, రాజకీయాది విజ్ఞానవ్యాప్తికొఱకు, సంగీత సాహిత్యసేవా కార్యకలాపములకొఱకు, లలితకళల అభ్యాసమునకు, కుటీర పరిశ్రమల కృషికి, వివిధవర్గములకు తరగతులకు చెందిన ధనిక - బీద స్త్రీ లనేకులను ఒక్కచోట సమావేశ పరచి వారలలో అన్యోన్య స్నేహసౌభ్రాత్రముల, సహానుభూతి సహకారముల, పురికొల్పజేయుటకు నెంతయు పాటుపడు ప్రగతిశీలమగు నిర్మాణ కార్యకలాపమని విమర్శకులెల్లరు గుర్తింపక తప్పనట్లు ఈ స్త్రీల శాఖయు - దానికి అనుబంధముగ చేర్పబడిన పరిశ్రమల విభాగమును దినదినాభివృద్ధిపొంది, స్థాపకుల ఆశయ ములు సఫలమగునట్లు ఆదరాభిమానములు గలవారందరు తోడ్పడవలెనని కోరెదము.

## శ్రీమతి సరోజినిదేవి హెచ్చరిక

బొంబాయి నగరములోని కామాటిపురమున గల మార్కండేయ మందిరమున జరిగియుండిన సభలో సమావేశమైయుండిన ఆంధ్రస్త్రీల నుద్దేశించి, శ్రీ సరోజినినాయుడు సతి చెప్పినమాటలు గమనింపదగినవి.

"ఆంధ్రదేశము చాల గొప్పది. ఆంధ్రరాష్ట్రము దేశభక్తికి సుప్రసిద్ధము. అట్టి పేరొందిన ప్రాంతమునుండి యీ బొంబాయి ప్రాంతమునకు వచ్చి నివాసమేర్పరచుకొన్న స్త్రీలు రాట్నమును చేబూని నూలువడికి స్వగృహములందే ఖద్దరు వస్త్రములను తయారుచేయించుకొనవలెను. చరఖాను అవలంబించి దాని ఆధారమున జీవిక కొఱకు కొంత ఆదాయమును సంపాదించుకొనుచుండినచో మీకు దారిద్ర్యము ఉండనేరదు. రాట్నపరిశ్రమను ఒక పవిత్రమైన విధిగా మీరు అవలంబించుట శ్రేయస్కరము."

పెద్ద పట్టణములు చేరుకొని, జీవితము గడవక, ఆదాయవ్యయములకు పొందిక కుదరక, లేమిని - ఋణబాధను అనుభవించుచుండి, మార్గాంతరములు తోచని సామాన్య కుటుంబినులకును బీద స్త్రీలకును రాట్నలక్ష్మి శరణ్యము శ్రేష్ఠమనుట నిక్కువము.

## స్త్రీల కోర్కెలు

ఆగష్టు 22 వ తేదీని పూనా గోఖలేహాలులో సుమారు 600 మంది ప్రతినిధులుగల మహిళా మహాసభ బిల్లిమోరియాసతి అధ్యక్షతక్రింద సమావేశమైనది. శాసనసభా సభ్యురాలగు శ్రీమతి అన్నపూర్ణ దేశముఖ్ ఈ సభా ప్రారంభకురాలు.

అధ్యక్షురాలు తన ఉపన్యాసములో, భారతదేశ స్త్రీలలో అత్యంతాధిక సంఖ్యాకులకు చదువను వ్రాయను కూడ రాకపోవుట శోచనీయపరిస్థితియనియు, స్త్రీల అభివృద్ధి సంస్కరణములగూర్చి యెట్టి విధానములు కార్యక్రమములు యోచించి యేర్పరచినను, అన్నిటికిని ముందుగా ప్రధానముగా విద్యావ్యాప్తి విశేషముగా జరిగితీరవలెనని నొక్కిచెప్పిరి. స్త్రీలే గ్రామపునరుద్ధరణ నిర్మాణ కార్యకలాపములకు పూనుకొని పనిచేయవలెనని హెచ్చరికచేసిరి. విడాకులచట్ట అవసరమును గలదని జ్ఞాపకముచేసిరి. వారసత్వము, ఆస్తి హక్కుల గూర్చిన శాసనములు న్యాయనిర్ణయము స్త్రీలకు అనుకూలముగా ఏర్పడవలసియున్నవనిరి.

సభాప్రారంభకురాలు తన ఉపన్యాసములో, స్త్రీలకు సంబంధించినంతవరకు హిందూ లా ను మహిళామణులే సంస్కరించి నిర్ణయము చేయవలసియున్నదనిరి. విద్యావతులగు అవివాహిత యువతులలో ఈమధ్య ఒక శోచనీయ ప్రవృత్తి ప్రబలుచున్నదని ఉదాహరించుచు, ఇదివరకే వివాహములైయున్న పురుషులను చేపట్టుచున్నవారి సంఖ్య అధికమగుచున్నదనియు, ఇందువలన సోదరీ సమానలగు ప్రథమభార్యల సుఖమయ వివాహజీవనములకు అన్యాయము చేసినవారగుచున్నారనియు, ఇది కూడనిసంగతి యనియు ఖండించిరి. హిందూ స్త్రీలకు విడాకుల హక్కు అవకాశములిచ్చే శాసననిర్మాణము అవసరమనియు ఈమె తన వాదములు తెలిపెను.

పై రెండు ఉపన్యాస సంగ్రహములలోను గమనార్హమైనట్టియు, ఆలోచనీయమైనట్టియు భావములు సందర్భవిశేషములు ఉన్నమాట నిజము.

అన్నిటికంటె ముఖ్యముగ, ఈ యిద్దరుభార్యల సమస్య, ఎదుర్కొని పరిష్కారముచేయవలసిన అవసరము జరూరైనది. సంఘములో చూచినను, ఈమధ్య పత్రికాసాహిత్యమును గమనించినను, ముఖ్యముగా 'సాంఘిక' మనబడెడు ఫిలుములను చూచుచున్నను, చదువురాని మొదటిభార్య - చదువుకున్న రెండవ భార్య సమస్య, పల్లెటూరి భార్య - పట్నవాసపు నాగరికసతీసాంగత్యసమస్య, పెద్దలుచేసిన వివాహము - పురుషుడు తాను స్వతంత్రముగ ప్రణయగుండములోపడి చేసుకొన ప్రయత్నించే మళ్లీపెళ్లి చిక్కులు, చూడ నిష్టములేకున్నను కనపడితీరు యదార్థసంఘటనలుగ తోచుచున్నవి. విద్యావతులయిన యువతులు తమ స్వసుఖముకోసము, తమ వివాహసమస్యా పరిష్కారముకోసము, ఐతేనేమి, కొందరు సోదరీమణులకు యావజ్జీవ దుఃఖమును కలుగజేయ తోడ్పడుట క్షంతవ్యముకానిపనియే. సంఘజీవనమును శాంతి సుఖ సంతోషముల వైపుకు అభివృద్ధిమార్గమున సంస్కరించి దారిచూపి సౌభాగ్యమొనగూర్చవలసిన విద్యావతులు, ఇద్దరు భార్యల సమస్యను తెచ్చిపెట్టుట అవివేకము. మొదటిభార్యలకు తీరని సంకటము. స్త్రీలకు పాతివ్రత్యమును, పురుషులకు ఏకపత్నీవ్రతమునే ఎన్నటికైన ఉత్తమోత్తమ ఆదర్శములు, ఆచరణలో సఫలములు అగును.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.